# మహామంత్రి

శ్రీ కర్లపాలెం కృష్ణారావు

పబ్లిషర్సు :

జాకోబిన్ పబ్లిషర్సు. తెనాలి.

 1945 [ పన్నెండు అణాలు



శ్రీమంతులును

ప్రజారంజకులును

భాషాపోషకులును

అగు

రాష్ట్రబహద్దూర్

శ్రీ

జాగర్లమూడి

కుప్పుస్వామి చౌదరిగారికి

కృతజ్ఞతాపూర్వక సమర్పణము

కర్లపాలెం కృష్ణరావు

౧

చంద్రగిరిపురమున సామ్రాజ్యాధిపతి సాళువనరసింహరాయని కోటలోపలి భాగమున దర్బారు మహలు ఎదురుగ జాతిరత్నములతో బొదిగిన వజ్రసింహాసనమును, దక్షిణభాగమున మహామంత్రుల యున్నతాసనములును, అటు పిమ్మట చిత్రవిచిత్రములగు రత్నకంబళ్ళతోను, మేటి నగిషీలతోనమర్చిన వేదికలతోడను,అలంకరింపబడియుండెను. హాలున కిరు పార్శ్వముల ద్వారములు గలవు. ఉభయ ద్వారముల జీవకళలుట్టిపడ చంద్రశిలాది నిర్మిత నిలింప కామినీ ద్వయము పూలమాలలచేబూని క్రీగంటి వీక్షణములతో మందహాసములతో ప్రకాశించు చుండిరి.

సామ్రాజ్యాధిపతి దర్శనమున కరుదేరు నతిథుల నాహ్వానించుటకే విగ్రహములు దవ్వుదవ్వున కేతెంచు చున్నట్లతి మనోహరముగ నున్నవి. ప్రభువులను జూడ నేతెంచు పౌరులు ప్రక్క ద్వారమునుండి యరుదేరవలెగాని సింహాసనమున కెదురుగా రాకూడదని కట్టడి. మంత్రి సామంతులు ప్రవేశించుట కావామభాగమున మరియొక మార్గమున్నది. సేనాధిపతులు, వందిమాగధులు, దౌవారి

కులు, తక్కుంగల పరివారము వారివారి స్థానముల నప్రమత్తులై వేచియుండిరి. మఱికొందఱు సదస్సులును దిశలు బరికించుచు గూర్చొని యుండిరి.

అది ప్రభువు లరుదెంచు సమయము కాబోలు, అంతయు నిశ్శబ్దముగనున్నది. వేళ లతిక్రమించి ఒక ఘడియ కాలమట్లు జరిగిపోయినను అచటివారల్లై కదలక మెదలక నుండిరి. ఇంతలో వేత్రహస్తులు సందడులు కూడదనునట్లు సంజ్ఞలుచేయుచుండ ఈవలావల హెచ్చరికలు జరుగ "జై మహామంత్రులకు జై" అను వాక్యములు చెలరేగ కింకరు డొకడు మునుముందు మార్గము జూపుచుండ, డంబైన తలపాగ ధరించి, ముత్యాలమాల కంఠమున వ్రేలాడ, నవరత్నఖచితమగు నడికట్టు అలంకరించుకొని పైన గప్పుకొన్న బంగారు దుప్పటితో మందగమనుడై సచివాగ్రణి దర్బారున కేతెంచెను. అందఱొక్కుమ్మడి లేచి వినయ విధేయత లొప్ప నమస్కరించుచుండ వేదశాస్త్రజ్ఞులగు విద్వాంసులు, కవులు ఆశీర్వదించుచుండ ప్రధాని తన వేదిక నధిష్ఠించినంత మెల్లమెల్లగ సందఱు తమ తమ స్థానముల గూర్చొనిరి. ఆనాఁడేలనో గాయకులను వలదని కనుసన్నల బంపివేసి అధికార దర్పమును వెలిబుచ్చు నగాడ్కల నొక పర్యాయము సభను గలయజూచి, ఆ మంత్రిశేఖరుఁడు సేనాధిపతిని రప్పించి కొంతతడ వేదియో ముచ్చటించెను. అనంతర మా సేనాధిపతి సభికులను జూచి "ప్రభువు లీదిన మిచ్చటికి విచ్చేయరు. అందువలన కొలువు జరుగదు" అని

ప్రకటించెను. ఈ వాక్యములు విని ఒకరి మొగ మొకరు చూచుకొనుచు ఎవరికివారు సర్దుకొనుచుండిరి. అప్పుడే మంత్రి తనవెంట సేనాపతిని రమ్మనమని దక్షిణద్వారమున తన ఆలోచనామందిరమును చేరెను.

ప్రభుకార్యాచరణ సంతతోత్సాహభరితుడును, ఆంధ్ర సామ్రాజ్య సంరక్షణదక్షుండును, దేవ గురుసమాన ధీవిశాల తేజో విరాజితుడును, అధిక విభవోజ్వల మహాధికార సంపన్నుడును, దశ దిశాక్రాంత యశోవిరాజితుడును నగు నాదెళ్ళ చిట్టిగంగనామాత్యుని శక్తి సామర్థ్యములు నిందింపనరానివి. పేరునకు మాత్రము సాళువ నరసింహ రాయుడుగాని, రాజ్యచక్రమంతయు బహు మేధావియగు గంగనామాత్యుడే నడుపుచుండెను. ఆ కాలమునగల అర్థ శాస్త్రవేత్తలలోను, రాజనీతి కోవిదులలోను, మంత్రుల లోను ఇతడగ్రగణ్యుడు. రమారమి డెబ్బది సంవత్సరముల ప్రాయ ముండియు ఉత్సాహము, చురుకుదనము గల యువకునివలె దేహపటుత్వము గలిగి సర్వదా హితైషియై క్షేమముగ రాజ్య తంత్రముల కొనసాగించుచుండెను. ఇతని కార్యనిపుణతను గమనించియే వైరులగు గజపతులు వెనుకాడుచుండిరి. బహమనీ సుల్తానులు గడ గడ లాడుచుండిరి. సామంత భూకాంతులు తమ తమ యంతరముల గుర్తెరింగి సంచరించు చుండిరి. ఈ మంత్రిశేఖరునకు సర్వకాల సర్వావస్థల యందును సామ్రాజ్య సంరక్షణను గూర్చిన చింతయే! అతడే కార్యము నాచరించినను, ఏ ఆలోచనల జేసినను,

ఎవరితో ప్రసంగించినను రాష్ట్రమందలి శాంతిభద్రతలను గూర్చియే !

ఆలోచనా మందిరమున గంగనమంత్రి దీర్ఘాలోచనా పరుడై మిన్ను జూచుచు గూర్చుండెను. మధ్య మధ్య నతని ఫాలభాగమున ముడుత లేర్పడి కనుబొమలు ముడివడు చున్నవి. పరిష్కారమున కందని కఠిన సమస్య లేవో ఆ మహాశయుని కలవరపెట్టుచున్నవని తోచుచున్నది. చెంత నున్న సేనాని "అదుగో రాజవైద్యు లేతెంచుచున్నారు" అనెను. ఆలోచనలు పటాపంచలు గాగ, మరుక్షణమున ప్రసన్నవదనుడై లేచి గంగన వైద్యున కుచితాసనము జూపుచు "దయచేయుడు. రాజుగారిని దర్శించి వచ్చితిరా" అనెను. ఉభయులు కూర్చుండిరి.

వైద్యుడు:— చిత్తము. అలజడికి కారణ మేమియు గను పింపదు. కొంచెగ నెమ్ము జేసినది. అందుమీదట శరీర ముష్ణముగ నున్నది. "పడిశెము పదిరోగముల పెట్టు" గదా !

గంగన:— జలుబు చేసినది గాబోలు !

వైద్యుడు:— అంతెమాత్రమే. మరేమియు లేదు. ఈ పూట ఆహార మేమియు వలదని చెప్పి ఔషధమును వాడివచ్చి తిని. రేపటికి తేలికగా నుండవచ్చును.

గంగన:— ఆహార మనసే మానివేసిన మరింత నీరసించు నేమో !

వైద్యుడు:— అయినను యిబ్బంది లేదు. లేశమాత్రము జ్వర తాపము ఇట్లు దోచుచున్నది. అవసరమైన రాత్రికి కొంత క్షీరము నిప్పించుడు.

గంగన:—అలాగే. ఈ దినము తమ రిచ్చటాగుట మేలు.

వైద్యుడు:—చిత్తము. ఈపూట తమకొక రకముగనున్నారే!

గంగన:—ఏమి ?

వైద్యుడు:—ఏలనో వదనము వాడియున్నది. రాత్రి చక్కగ నిద్రించితిరా ?

గంగన:—ఆహా, మామూలునకు భిన్నము లేదు. గాని ఏవో

వైద్యుడు:—అధికతరాలోచనలు కనకాన మిచ్చిన తమ ఆరోగ్యము చెడునేమో యని నా తలంపు.

గంగన:—(నవ్వుచు) మంత్రులు చేయవలసినపని ఆలోచనయే గదా! లేకుండుటెట్లు ? ఉద్యోగధర్మమది.

వైద్యుడు:—అయినను, వయసునకు దగిన పరిమితి యుండవలె నని నామనవి. తమకిప్పుడు ..........?

గంగన:—ఇంచుమించుగ డెబ్బది.

వైద్యుడు:— ఈ ప్రాయమున స్వీయసౌఖ్యముల వర్జించి స్వార్థమనుమాట లేక పరోపకారబుద్ధితో సామ్రాజ్య సంరక్షణము జేయుచున్న మీ విశాల హృదయమును కార్యదీక్షయు, గొనియాడ దగినవి.

గంగన:— కొనియాడవలసిన పనిలేదు. అట్లాచరింపక గం పోవు టపరాధమగునుగాని, చేసినందువలన తన విధిని తానునెరవేర్చినట్లగునుగదా! ఇందులకు కొనియాడు టేల? స్వదేశసేవానిరతి ప్రతివానికి విధియై యపుడు నావంటివాని విషయము వేఱుగ జెప్పవలెనా? — చిత్తగించితిరా! మన రాష్ట్రముపై నిపుడనేకులు కన్ను వేసియున్నారు. దేశమందనేక అంతఃకలహములుగూడ నున్నట్లు తోచుచున్నది. ఈచిక్కులన్నియు క్రమక్రమముగ పరిష్కరింపబడి వర్ణాశ్రమ ధర్మములు చక్కగ సాగుచున్నప్పుడుగదా మాకు విశ్రాంతి? ఎప్పటికప్పుడేదో యొక నూతనాందోళనము తలయెత్తుచునే యున్నది. ఈ అలలకంతులేదుగదా. ఒక్కొక్కప్పుడసలీ జీవితమునకు విశ్రాంతియో లేదేమో యనిపించుచున్నది.

వైద్యుడు:— ఔను. పదవియందున్నంత కాలము అధికార కార్యనిర్వహణము జరుగవలసినదే — అందులకే వృద్ధాప్యమున పదవులను విసర్జించి శాంతముగ ఆధ్యాత్మిక చింతతో జీవితశేషమును గడుపవలయునని బుధులందురు. కాని అధికార వాంఛతోగాక జీవితమునే దేశమున కర్పించిన మీవంటి త్యాగమూర్తులకా యవకాశములు....

గంగన:— కావచ్చును. పరిస్థితులుగూడ నట్లే యున్నవి ... ......ఉష్ణాధిక్యతవలన గాబోలు నాకు శిరోభారాంద్య మేర్పడినది. తలంటుటకు కొన్ని తైలములు పంపుడు.

మహామంత్రి 7

వైద్యుడు:— చిత్తము. అత్యవసరముగ పంపగలను.

గంగన:— నేనొకపర్యాయము రాజదర్శనమున కేగవలెను. అవసరమైనప్పుడు తమకు వార్త వచ్చును

వైద్యుడు:— చిత్తము. సెలవు.

అనుచు వైద్యుడు మెల్లగ లేచివెళ్ళెను. పిమ్మట మంత్రి సేనాపతిని జూచి, "ఓయీ! ఆజ్ఞలను శిరసావహించి అప్రమత్తుడవై సంచరింపుము. దక్షిణదిశ కాపులకు యిప్పుడే హెచ్చరికలు పంపుము. మన దళములు జాగ్రత! అశ్వశాల కీపూటనే వెళ్ళి వలయు నేర్పాటులు జేయుము. గూఢచారుల నొక కంట గనిపెట్టుచుండుము. దేశమందన్ని మూలల నుండి రాజద్రోహుల జాడలను దెల్పింపుము. కుట్రలు పన్ను ద్రోహులకు కఠిన శిక్షలు దప్పవు. మత కలహములు వర్ణభేదములు మన రాజ్యమున యుండగూడదు. ఎవరి మతము వారిదే. ఒకరి కొకరు అడ్డు రాగూడదు. సర్వమతముల వారికి సమసాయముల గల్పింపుము. మహమ్మదీయులకు ప్రత్యేక సౌకర్యముల నేర్పాటు చేయుము. కులధర్మముల పాటించి, ప్రజలు స్వేచ్ఛగ సుఖపడవచ్చును. వాడ వాడలకు ప్రకటనల నందచేయుము. మన సీమలలో పల్లెపట్టుల ప్రాంతముల రాజవంశమునకు జెందిన విద్రోహుల నన్వేషింపుము. ఇది ఆజ్ఞ........." అనెను.

సేనాపతి శ్రద్ధాభక్తుల నాలకించి "చిత్తము"ని అనుజ్ఞ వడసి వెడలిపోయెను.

గంగనామాత్యు డిప్పు డేకాంతముగ నున్నాడు. ఆయన ఊహాపథ మిప్పుడు మేరమీరినది. ఏకాగ్ర చిత్తమున దీర్ఘాలోచన జేసి, ఒకదాని వెనుక నొకటిగ నడ్డువచ్చు సమస్యలను పరిష్కరించుచున్నాడు. కొంతతడవిట్లు జరిగినది. ఉన్నట్టులుండి ఆయన "కాను ! వృద్ధాప్యము - గడచినంతకాలము గడువబోదు. ఇక నెంతకాలమో జీవింపను. రాజ్య మీ స్థితిలో నున్నది. గజపతులు రాజవంశీయులగు విగ్రహులతో కుట్రలు పన్నుచున్నట్లు తెలియుచున్నది. ఇందులకు దగిన ఫలిత మచిరకాలమున వారనుభవింపకపోరు. ఒకవంక బహమనీ సుల్తానులు - వారల సంగామాత్రము నమ్మరాదు. ఒకప్పు డుపేక్షించుట ప్రమాద మగునుగూడ. వీటన్నిటి కేమిగాని, విద్యానగర సామ్రాజ్య మిప్పుడు మంచి స్థితిలో లేదు. ఆ రాజ్యమున ప్రజలయు దుస్సాంప్రస్థి మెండైనది. స్త్రీ లోలుడగు విరూపాక్షరాయలు దుర్వర్తనుడై ప్రజల బాగోగులను విచారింపక ఉపేక్షసి యుండుటలకు ముఖ్యకారణము... ఓహో ! ఎన్ని చిక్కులు ! ఎన్ని సంకటములు ! నేనించుక అశ్రద్ధ వహించిన ఈ పాటి కాంధ్రరాజ్యము నశించి యుండును— సందేహము లేదు ... ఈ శత్రువుల నిప్పుడే జయించుటకు తగిన బలము లేదు గదా !... కర్తవ్యము ! నేను మరణించిన?... నాయనంతరము—? ఈ సామ్రాజ్యమును రక్షింపగల రక్షకులేరి ? నా స్థానమాక్రమించి ఈరాజ్యచక్రము నవతల నడుప మేధావి గలడా ?—ఎవరున్నారు ? అంతటి మనిషి ? అంతటిశక్తి

సామర్థ్యములు గల కళాప్రవీణుడు? .... స్ఫురించినది.... నాబంధు వర్గమున రాచిరాజు సంతానము తిమ్మరుసు, గోవిందరాజులను సోదరులు గలరు. మాసోదరుని మనుమడగు తిమ్మరాజునకే రాచిరాజు కుమార్తె కృష్ణమాంబను జేసు కొంటిమి.... వారిప్పుడతి బీదస్థితియందున్నారు. తిమ్మరుసు, గోవిందరాజు లిద్దరును జాతిరత్నములని వినుచున్నాను. అందును తిమ్మరుసు ఉభయభాషా ప్రవీణుడవుయు, ప్రజ్ఞా వంతుడనియు, చతురమతియనియు చెప్పుచున్నారు. ఇటీవల జంద్రగిరిలోను, పెనుగొండలోను వీరిముచ్చటలే నేనాలకించి తిని—ఆయువకులనేల రప్పింప గూడదు?.... ఔను! చక్కని త్రోవ! ఆయువకుల నిప్పుడే రావించి, వారికి దగిన జీవనో పాధి కలిగించి క్రమశిక్షణ మిప్పించెద — వారిన కొంత కాల మీనారాయణ వనమునందే యుంచెద...అని యను కొనుచుండెను.

మిట్టమధ్యాహ్నము. భాను డుగ్రమూర్తియై మింట వెలుగుచుండెను. చేటలతో నిప్పుకణములు చెరుగుచున్నట్లున్న యీ మండువేసంగి యుష్ణాధిక్యతకు జీవరాసు లల్లాడుచున్నవి. ప్రాణుల కతి భయంకరముగా దోచు వెచ్చటి సుడిగాల్పులు జెలరేగినవి. అన్నాతురులగు నిర్భాగ్య లోకరిద్దరు దప్ప ఆ సమయమున వీధులవెంట తిరుగుట కెవరు సాహసింతురు ? హర్మ్యసౌధముల శీతలోపచారముల గల్పించుకొని హాయిగ సుఖించుచుండు శ్రీమంతుల కాబాధ దెలియక పోవచ్చునుగాని నిలువ నీడలేక, యే తరుచ్ఛాయలనో విశ్రమించు గర్భదరిద్రు లెంత ఆవేదన పడుచుండిరో ! ప్రకృతియే వారికి దగిన సౌకర్యములు గలిగించునుగాబోలు ! ఆపద్బాంధవుడగు జగన్నాటక సూత్రధారియే వారలను రక్షించుచుండనోపు !

చంద్రగిరియందొక చిన్న పటకుటీరమున మలినపూరితమగు జీర్ణవస్త్రముల ధరించి గోవిందరాజులు నిలువబడి తమ దుర్భర దరిద్రావస్థను గూర్చి చింతించువానింబోలె అనన్య మనస్కుడై యుండెను. అతడు మాటి మాటికి

దిక్కుల బరికించుచు, నిరాశతో వెనుకాడుచు, తనలో తా నేదియో తర్కించుకొనుచుండెను. "అపరాహ్ణము దిరిగినది. అన్నగారు తరుదెంచు జాడలు గోచరించుటలేదు. అనుదిన మూసరికి దిరిగివచ్చువాడు డీనాడేలనో మరలి రాకుండె - ఏవాడ కేగెనో? ఏ సీమ జేరెనో? మార్గ మధ్యమం దేయాపదయు సంభవించియుండదు గదా! అట్లెన్నటికిని జరుగదు. మావంటి దిక్కులేనివారల నా దయామయుడగు సర్వేశ్వరుడు సర్వదా రక్షించుచుండును. ఓహో! సూర్య భగవానుడా! ఏమి నీ ప్రతాపము! నీ ప్రచండదీప్తి కెవరు తాళగలరు? భూభాగము దద్దరిల్లిపోవుచున్నది. నూతుల గోతుల నీరెండి పానీయము లలభ్య మగుచున్నవి. జల నిధులగూడ నింక జేతువా? ఏమో! అంతటివాడవే! దేవా! శాంతింపుము - ప్రాణికోటుల రక్షింపుము - అన్నగా రేమైరో? వాడ వాడను, గడప గడపకు దిరుగవలసిన యీ భిక్షాటన మెంత కష్టభరితము! నీచాతి నీచము - దీనాతిదీనము - ఎండ కెండుచు, వానకు దడియుచు అడ్డ మైనవారి నాశ్రయింపవలయును గదా! ఆహా! ఎంతటి వారి కెన్ని కడగండ్లు! మా పూర్వులందరు సాళ్వవంశ ప్రభువులయొద్ద మంత్రులుగను, దండనాథులుగను నుండి పేరు ప్రఖ్యాతుల నార్జించిరి. మా తండ్రికాలమున స్వస్థాన మగు కొండవీటి సామ్రాజ్యమును గజపతులు జయించి ఆక్రమించుకొనుటవలన సాళ్వరాజులు చంద్రగిరి వలసపోయి నూతన రాజ్యమును స్థాపించుకొనిరి. గత్యంతరము లేక

మేమును చంద్రగిరికే రావలసివచ్చినది. ఈనాటికి మాకీ గతి పట్టినది. మంత్రిపదవులు లేకున్నమానె. వేళకింత తిండికి గూడ నోచుకొనలేముగద! ఏమో! అప్పుడే మా బ్రతుకు తెల్లవారినదా! మంత్రిపదవి మాకుగూడ లభించునేమో! ఈశ్వరేచ్ఛ ఎట్లున్నదో—" అని యనుకొనుచు దిక్కులను గలయజూచుచుండెను. ఇంతలో 'తిమ్మరసు' దూరముగ గోచరించెనుగాబోలు "అదుగో తిమ్మరుసు!" అని కేక వేయుచు యెదురేగి అన్నను గౌగిలించుకొని తోడ్కొని వచ్చెను. "అన్నా! ఈ యెండ కేమైతివో యని దిగులుపడు చున్నాను. ఇంతకాల మెక్కడ నుంటివి?" అని గోవిందరా జనెను.

తిమ్మ:— ఏమియు భయములేదు. ఈ సమీపమున యున్న యొకపల్లె కేగితిని. మరలివచ్చుటలో గొంత ప్రొద్దెక్కి నది, గాని దారిలో వచ్చునప్పు డొక చిత్రము జరిగినది సుమా!

గోవిం:— అంతటి వింతయా!

తిమ్మ:— ఔను వింతయే! నేను మరలి వచ్చునప్పుడు మార్గ మధ్యమున నొక చిట్టడవి దాటవలసి యున్నది. అక్క డికి వచ్చునప్పటికి ప్రొద్దెక్కుటవలన నడువలేకపోతిని. మఱియు దాహమైనది.

గోవిం:— ఎక్కడనైన పడిపోతివా స్వామి?

తిమ్మ:— లేదు లేదు. శాంతముగ వినుచుండుము- అంతట ఆ చిట్టడవిలో నొక గుంటదరి కేగి దాహము తీర్చు

కొని బడలిక దీర నొక తరుచ్ఛాయ నించుక శయనించితిని. నడిచినడిచి యున్న నాకెపుడు పట్టినదో తెలియకుండగనే నిదురపట్టినది. అట్లెంతసేపు నిదురించితినో! కొంతసేపటికి నన్నొక సిద్ధుడు నిదురనుండి లేపెను.

గోవిం:— సిద్ధుడా! ఎవరో!

తిమ్మ:— సిద్ధుడే! ఎవరో నాకు మాత్రమేమి తెలియును? లేపి "వత్సా! నీవెవర"వని ప్రశ్నించెను. సమాధానము చెప్పితిని. అంతట నతడు అబ్బాయీ! నీవిచట నిదురించుచుండ నీ మొగమున కెండతగులకుండ నొక కృష్ణసర్పము వంచి తనపడగ విప్పి పట్టినది.

గోవిం:— కృష్ణ సర్పము పడగవిప్పి పట్టినదా! అమ్మయ్యో! ఎంతభయము! ఆపామును నీవు చూచితివా?

తిమ్మ:— నేను చూడలేదు. ఆ సిద్ధుడు చెప్పినమాటలు చెప్పుచున్నాను. వినుము—ఆసర్పము పడగవిప్పి నామొగమునకు పట్టినదట—అట్లెంత కాలము జరిగినదో తెలియదు. ఇంతలో ఆసిద్ధుడామార్గమున వచ్చుచు చూచి మెల్లగా నన్ను సమీపించెనట. ఆసిద్ధుని రాకజూచి సర్పము తన దారిన తానుబోయెనట— అంతట సిద్ధుడు నన్ను నిదుర నుండి లేపి నాకీసంగతులు చెప్పెను.

గోవిం:— ఇదెంతటి వింత యన్నా! సత్యము!

తిమ్మ:— సత్యమే గావచ్చును. ఆయన కసత్యము నాడవలసిన యవసర మేమున్నది? అతను నాతండ్రి తాతలపేళ్లు,

కులగోత్రములు అడిగి తెలుసుకొనెను. అది మహాపురుషుల లక్షణమట. నాయందనేక శుభ చిహ్నములు గోచరించుచున్నవట."

గోవిం:— ఏమి మహాపురుషుల లక్షణములో! మనమెక్కడ! మహాపురుషులెక్కడ! ఏటి మాటలు ?

తిమ్మ:— ఇంకను వినుము. అతడు నన్ను హృదయపూర్వకముగ నాశీర్వదించి, లేవనెత్తి "వత్సా! నీ కచిరకాలంబున మహాధికారమును, మహదైశ్వర్యంబులును లభింపగలవు. అట్టి లక్షణము లనేకముగ గన్పట్టుచున్నవి." అనెను.

గోవిం:— చిత్రముగనే యున్నది.

తిమ్మ:— అంతటితో వదలక నతడు నా చదువు సంధ్యలను బరీక్షించి, మెచ్చుకొని, నన్నికముందు "రాజనీతి విద్యాభ్యాసమునకు గడంగుమని ఆజ్ఞ యిచ్చి తన దారిన వెళ్ళెను.

గోవిం:— ఎవరా సిద్ధుడు ? ఎటు బోయెనో ?

తిమ్మ:— నాకునమాత్ర మేమి తెలియును?

గోవిం:— వివరముల గనుగొననలదా! మరల నెప్పుడైన

యా మహాత్ముని దర్శించుటకు వీలుండునేమో!

తిమ్మ:— ఎప్పుడైనను గనుపించినప్పుడు చూడవచ్చును లెమ్ము.

గోవిం:— ఎంతటి సుదినము!

తిమ్మ:— కాని మన కేమహాపదవి లభింపగలదు! ఇంతవరకట్టి యవకాశములే లేవుగదా! అఘోర దారిద్ర్య [illegible] వింపవలెనో! ప్రాథమిక, మాధ్యమిక విద్యలు పూర్తి జేసి ఉన్నతవిద్యగూడ పూర్తి [illegible] [illegible] ఏ సంపన్నుని [illegible] కొలువునను [illegible] [illegible].

గోవిం:— మనకష్టము లెప్పటికి తీరునోయని [illegible] చింత గూడ. కిందటేలో మేలన్నట్లు [illegible] వెంటనే అప్పువా [illegible] బంపి వేసితిమి. కాకున్న మరికొంత బాధ్యత మన నెత్తిపైనుండెడిది. ఉన్నంతలో నిర్విచారముగ స్వతంత్ర జీవనము జేయుచున్నాము.

తిమ్మ:— అన్నట్లు జ్ఞాపకమునకు వచ్చినది. ప్రధాన మంత్రి నాదెళ్ల చిట్టిగంగన మనకు సమీపబంధువుగదా! అతడే భూకాంతుని కొలువున మనకొక పదవి నిప్పింపగూడదా?

గోవిం:— ఎంత పిచ్చివాడవు. బంధువు లెప్పుడును మనకు సహాయపడరు. "అయిన వారి నాశ్రయించుట కంటె కానివారి కాళ్ళుపట్టుకొనుట మేలు." చిట్టిగంగనగారి నెప్పుడును మనము సహాయాపేక్షతో జూడ గూడదు. ఏమందువు ?

తిమ్మ:— నిజమే ! మనకు మంచి దినము లెప్పటికి రానున్నవో ! ఇంకను కొంత కాలమిట్లె వేచియుండి ఆ సిద్ధుని ఆజ్ఞ ననుసరించి రాజకీయార్థ శాస్త్రములనుగూడ పట్టుదలతో పూర్తి జేయవలెను.

గోవిం:— అట్లే. కాని అకాలమైనది. భుజింతము లెమ్ము.

తిమ్మ:— భుజింపక చేయునదేమున్నది! భుజించుట, శయనించుట మానవులకే యవస్థయందును దప్పవు. ఏ ప్రాయమున నేది చేయవలెనో గమనించి అట్లాచరించుట అందము—మనకు విద్యార్థిదశ దాటుచున్నది. అవసరమైన చదువుల పూర్తిచేసుకొంటిమి. ఇక కర్తవ్యమాలోచింప కున్న నెట్లు?

గోవిం:— భగవంతుడే మనకొక మార్గము జూపగలడు. సాధ్యమైనంత త్వరలో ఆ ప్రయత్నమునకు బూనుకొందము.

ఉభయులును కొంతసేపిట్లు సంభాషించుకొని పిదప భోజనాదికములకు లేచిరి.

ఈ సోదరులనుగూర్చి చదువరులకు కొంత దెలుపుటవసరము. వీరు ఆరువేల నియోగిబ్రాహ్మణులు. కౌండిన్యసగోత్రులు. వీరి తండ్రి రాచిరాజని చదివితిరిగదా! తాత వేమరాజు. బాల్యముననే అన్నదమ్ములు తల్లిదండ్రులు లేనివారైరి. వీరి విద్యార్థిదశ చక్కని కట్టుబాటుతో సాగినది. నిద్ర లేచిన తోడనే కాలకృత్యముల ముగించుకొని సకల కర్మసాక్షియు ప్రత్యక్ష దైవమును నగు సూర్యభగవానునికి నమస్కరించి చదువులకొరకు బోవుదురు. మధ్యాహ్నమైనంతనే దయార్ద్ర హృదయులగు గృహస్థుల యిండ్లకు బోయి మాధుకర మెత్తినచ్చి భుజింతురు. పిమ్మట కొంత విశ్రాంతి తీసికొని వ్రాత చక్కగ గుదురుటకై గంటముతో

తాటాకులమీద వ్రాయుదురు. అనంతర మిద్దరును ఆ కాలమున నున్న గొప్ప అధికారుల యొద్దకు బోయి రాజకీయములైన వివిధ విషయముల నభ్యసింతురు. సాయంకాలము చల్లగా విహారమున కొంతదూరము నడిచివెళ్ళి ప్రకృతి సౌందర్యము నవలోకించుచు నానందించి సూక్ష్మదృష్టితో వస్తు తత్వమును గూర్చి గ్రహింతురు. దీపములు వెలిగించు వేళకు వెనుదిరిగివచ్చి, దేహపరిశ్రమయు, ఆయుధ పరిశ్రమయు గావింతురు. అంతట రాత్రి కాగానే భుజించి కావ్య పఠనమునకు గూర్చుందురు. సూచితిరా వీరి విద్యార్థిదశ. తిమ్మరుసు తమ్మునికన్న మిన్నగ ప్రతి విషయమునందును ముందంజ వేసెడివాడు. అట్లని గోవిందరాజు మందబుద్ధి గలవాడని తలంపరాదు. అతడును నాటి వారలలో మేటియే. ఈవిధముగ వారు విద్య నభ్యసించి ఉభయ భాషలయందును జక్కని పాండిత్యము నార్జించిరి. వారి పాండిత్యమునకు చోడు ప్రజ్ఞావంతులనియు, గుణవంతులనియు, ఆ యా వాడలలో ప్రజలు చెప్పుకొనసాగిరి.

# 3

రాజమందిరమునం దొకభాగమున ఉత్తరపుహాలులో ప్రధానామాత్యులును గుత్తిదుర్గమునకు ప్రభువైన యళువ నరసరాజును సంభాషించుకొనుచుండిరి. వారేదియో తీవ్రమగు రాచకార్య సమాలోచనలు గావించుచుండిరని తోచుచున్నది. ఆప్రాంతములకు మరెవ్వరిని బోవనిచ్చుటలేదు. సామంతరాజులును, ఇతర దుర్గాధిపతులును, పాలెగాండ్రును చిట్టిగంగనామాత్యుని ఆజ్ఞలనే శిరసావహించుచు తమతమ పరిపాలనల సాగించుకొనుచుందురు. ఎట్టి విషమపరిస్థితులందైనను ఈమహామహుని సలహాగైకొనకుండ వారు ముందంజ వేయరు. అందును ఈ నరసరాజు ప్రప్రథమమున సార్వభౌముడగు సాళువ నరసింహరాయలకడ సేనాపతిగనుండి మెప్పులంది గుత్తిదుర్గమునకు పాలకుడయ్యెను. ఇతడే గాక యితని తండ్రి ఈశ్వరరాజుగూడ నరసింహరాయుని యొద్దనే బహుకాలము సేనాపతిగనుండి తన సహజ శక్తి సామర్థ్యముల ప్రదర్శించి అవక్ర పరాక్రమంబున ననేక దుర్గముల లోగొని జయపతాకముల నెత్తి చంద్రగిరి సామ్రాజ్యమును జాలవరకు విస్తరింపజేసెను. ఆకాలమునం దితని విజయములనేకవిధముల వర్ణింపబడినవి.

ఇంతటి పరాక్రమశాలియగు ఈశ్వరరాజునకు నరస రాజు తగిన పుత్రుడనియు, సుగుణసంపన్ను డనియు, గంగనామాత్యుడును సార్వభౌముడును నరసరాజును మిక్కిలి గౌర వించుచుండిరి. ఇతని నాయకత్వమున జంద్రగిరి సామ్రాజ్యము మఱింత శాంతిభద్రతలతో రక్షింపబడుచున్నదని నరసింహరాయుని విశ్వాసము.

నరసరాజా విధముగ పెద్దకాలము గంగనామాత్యునితో సంప్రదించుచుండెను. ఇంతలో నొక సేవకుడు నిశ్శబ్దముగ ప్రవేశించి వినయుడై నమస్కరించి నిలువబడెను. ప్రధాని యతనివంక గన్నెత్తి చూచి, "కొనివచ్చితివా ఆ యువకులను ?" అని ప్రశ్నించెను. "చిత్తము" అని అతడు ప్రత్యుత్తర మిచ్చినంత "మంచిది. సాయంకాలము వారిని రాజసభకు గొనిరమ్ము. పొమ్ము" అనెను. పిమ్మట సేవకుడు భయభక్తులతో మఱలిపోయెను.

నరసరాజట్లు కొంతతడవు ప్రధానితో ముచ్చటించిన పిదప యిరువురును లేచివెళ్ళిరి.

సాయంకాలము సార్వభౌము లాస్థానమున సింహాసనాసీనులై యుండిరి. మంత్రి సామంత పురోహితులు తక్కుంగల మహాజనులు తమతమ స్థానముల నలంకరించి యుండిరి. విద్వాంసులు యాశీర్వచనా నంతరము గాయనులు వీణలు చేబూని, తంత్రులు బిగించి, సుతిబెట్టి ఆరోహణావరోహణముల సప్తస్వరముల బలికించుచు సరస భావముల మృదుతర శబ్దార్థమిళితమగు సలంకారముల

జంత్రంబు గాత్రంబు జంట గావించి, మనోహరముగ బాడి, తమ ప్రావీణ్యమును బ్రదర్శించి సభికుల నానందవార్ధినోలలాడించిరి. రాలుసైతము గరగిపోవు విమల గానమాధుర్యమున కందరును ముగ్ధులైరి. వారి ప్రజ్ఞావిశేషంబులకును కళాకౌశలత్వమునకు మెచ్చి మహారాజు వారిని నుచితరీతి సత్కరించి పంపివేసెను. ఇంతలో నాట్యమేళమువారు విలాసముగ నలంకరించుకొని వచ్చి వినయులై మొక్కి ప్రక్కన నిలునబడిరి. భూమీశుండు మందహాసము జేయుచు నాట్యంబున కాజ్ఞయిచ్చెను. ఆ కాలమున బొజ్జసాని మేళము మిక్కిలి గణుతి కెక్కినది. అందచందములందును నాట్యకళాభినయమునందును బొజ్జసాని అందెవేసినచెయ్యి. హిరణ్మయి శలాకవలె యీ శృంగారవతి రెట్టించిన యుత్సాహంబున వచ్చి నిలువబడె మృదంగమువా డొకప్రక్కను, తాళము నజ్ఞుడు మరియొకదిశను నిలువ రాగ మాలాపించు రమణు లిద్దరు వెనుకనుండ బొజ్జసాని సభకు బ్రమొక్కి వేత్రిపాణి యొసంగిన గజ్జెలను పాదములకు ధరించి, పంచవర్ణంబుల కాశగ బిగువగ గట్టి చిరునవ్వుతో మహారాజు నొయ్యారముగ క్రీగంటజూచుచు ఇష్టదేవతలకు నమస్కరించి పుష్పాంజలినిబట్టి నాట్యమునకు గడంగెను. సభికులు నిశ్చేష్టులై రెప్పవాల్చక చూచుచుండిరి. అంత నా సాని తన సంగీతము సభయెల్ల గ్రమ్ముకొనగ, భూచారి నాట్యంబును, ఆకాశచారియు, గతిచారిభేదములును బ్రదర్శించి, భ్రమణ సంయుతదృష్టి పటిమయు పాణిభేదములును విచిత్ర

గతిని జూపి, సప్త తాండవములు సల్పెను. భూనాథు
డత్యానందమున వీక్షించుచుండ నాసాని మురళీధరునిగూర్చి
సంస్కృతాంధ్ర వాఙ్మయాది గీతముల మనోహరముగ
బాడుచు భావప్రకటనజేసి భరతశాస్త్రోచిత నానార్థకర
నాట్యంబుల ప్రత్యంగ సముదయ సౌందర్యముల నొక్కు
మ్మడి ప్రదర్శించి, అలసి, సొలసి, అంగలార్చుచు నిలువ
బడియెను. "భేష్, భేష్" అని ధరణీధవుడు మెచ్చుకొనుచు
గంగనామాత్యునివంక జూడ ప్రధాని రాజుగారి భావమెఱిగి
భూరివస్త్ర భూషణముల నిప్పించి బహూకరించి మేళము
వారిని సాగనంపెను.

అనంతరము మహారాజు రాజకార్య సమాలోచనా
యత్త చిత్తుడై యుండ గంగనామాత్యుడు ప్రతి విషయ
మును వివరింపుచు నానార్థసంగతులను నివేదించెను. అన్ని
టిని శ్రద్ధతో దిలకించి ఆలకించుచు వలయు నాజ్ఞల నొసంగి
పిమ్మట పౌరుల విజ్ఞప్తుల కవకాశమిచ్చెను. రాజదర్శనార్థ
మరుదెంచి నిరీక్షించుచున్న ప్రజలొక్కొక్కరుగ తమ తమ
కష్టసుఖముల విన్నవించుకొనియు అవసరముల మనవి జేసు
కొనియు తమ దారినేగిరి. ఇంతలో సైనికుడొకడు తిమ్మ
రుసును గోవిందరాజును వెంటగొనివచ్చి సభలో ప్రవేశ
పెట్టెను. గంగనామాత్యుడా యువకులను రాజునకెరుక
పరుచుచు, వారు తనకు సమీపబంధువులనియు, రాచిరాజు
పుత్రులనియు, శక్తిసామర్థ్యములు గల బుద్ధిమంతులనియు
చెప్పెను. "ఓహో! రాచిరాజుపుత్రులా! బుద్ధి కుశలతగల

వారని తోచుచున్నది. మన యీసంస్థానమున నుండుటకు వీరి
కభ్యంతర మూండదుగదా! పరీక్షించి సముచిత పదవులను
వారి కిప్పింపుము" అని రాజుగారనిరి. "చిత్తము. అట్లె
జరుగగలదు"! అనుచు మంత్రిశేఖరుడు తిమ్మరుసును
గోవిందరాజును కొంత తడవు వారి విద్యాబుద్ధులను బరీ
క్షించి. వారిని సంస్థానమున లేఖకులుగా నియమించెను.
గంగనామాత్యుడు సర్వస్వతంత్రుడైనను రాజాజ్ఞబడయక
తానేపనియు జేయడు. అతడు తన స్వాతంత్ర్యమును, పదవ
కాశములను దుర్వినియోగము చేసుకొనడు. అందువలననే
అతడు రాజుగారికి రాష్ట్రమందలి ప్రజలకును గౌరవనీయు
డయ్యెను. అటుపిమ్మట రాష్ట్రమందలి ముఖ్యప్రదేశముల
కొన్ని దేవాలయములు మసీదులు నిర్మించుట కవసర
మేర్పడినదని మంత్రి విన్నవింప, అందుకగు వ్యయమును
గూర్చి కొంతతడ వాలోచించి వెంటనే వాటిని నిర్మించు
టకు రాజుగా రాజ్ఞాపించిరి. మంత్రియు సేనాపతిని బిలిచి,
విషయమంతయు జెప్పి, నిపుణతగల నేర్పరులగు శిల్పులను
రప్పించి, మంచి పనితనముతో కట్టడముల ప్రారంభింప వల
సిన దనియు, అందుల కవసరమగు సన్నాహములను
వెంటనే చేయించవలసినదనియు చెప్పిపంపిరి.

కొన్ని వాడలలో మంచినీటి వసతులు లేనట్లు తెలియు
చున్నది. కొరతవడిన గ్రామాదులలో వెంటనే నూతులు
గోతులు త్రవ్వించి చక్కని నీటి సదుపాయముల గల్పించ
వలసినదనియు, ధర్మశాలలయందును, సత్రములయందును,

దేవాలయములందును విధిగా వర్ణాశ్రమ ధర్మములు పాటింప బడవలె ననియు మంత్రిపుంగవు డాజ్ఞాపించెను. గ్రామాంతరములనుండి వచ్చు అతిథి అభ్యాగతుల నాదరించి భోజనాదికముల నేర్పాటు జేయుటకు సంస్థానమందలి ధర్మశాల లన్నిటికి తాఖీదులు బంపిరి. రాష్ట్రమం దేప్రాంతమునన్నైన అన్నాతురు లుండగూడ దనియు అవసరమున్న ప్రతివారికి సంస్థానము పనిపాటలు చూపగలదనియు ప్రకటింపబడెను. నూతన పురుషు లెవరు పట్టణమున ప్రవేశించినను వారి (భోగట్టా) విచారించి అధికారులకు తెలియజేయ వలసినదని ప్రజలందరికి హెచ్చరిక చేయడమైనది.

అటుపిమ్మట ఆనాటికి కొలువు చాలించడమైనదని ప్రకటింపబడెను.

## ౪

తిమ్మరుసు గోవిందరాజు లిద్దరు సంస్థానమున లేఖకులుగ నియమింపబడినదాది శ్రద్ధాభక్తుల తమతమ యుద్యోగధర్మముల నెరవేర్చుచు నిపుణులై పెద్ద అధికారుల దయకు పాత్రులైరి. తిమ్మరుసుయొక్క సరసవచోనైపుణ్యమునకు, కార్యచతురతకు, ఆలోచనాపటిమకు అధికారులు మెచ్చుకొని అతడు మంత్రిపదవికి దగినవాడని ప్రశంసింప జొచ్చిరి. గంగనామాత్యు డనేక ముఖ్యవిషయములందు తిమ్మరుసు సలహాలను దీసుకొని, యతని బుద్ధివిశేషమున కలరి ఆనందించుచుండెడివాడు. తిమ్మరుసు సమయానుకూలముగ వర్తించుచు, ప్రధానామాత్యుని గురుతుల్యునిగ గౌరవించుచు, ఆయనమనసుకెక్కు మన్ననల నందుచుండెను. క్రమ క్రమముగ గంగనకు తిమ్మరుసుమీద అపరిమితానురాగ మేర్పడి, అతనికి అర్థశాస్త్రమునందును, రాజనీతియందును, మహామాత్యతత్వమునందు పూర్ణప్రజ్ఞానుభవములు గలుగునట్లు క్రమశిక్షణ నిప్పించెను.

ఆకాలమున కౌటిల్యుని యర్థశాస్త్రమును, కామందకుని నీతిశాస్త్రమును, రాజనీతిశాస్త్రీయ మర్మములును మహా

రాజ్య తంత్రవిధానములును బోధింపగల సమర్థులగు పండితులసంఖ్య బహు స్వల్పముగా నుండెను. కాని ఈ విద్యలన్నియు చిట్టిగంగనామాత్యునకు కరతలామలకములు— ఆమహనీయు డందరికిని సులభసాధ్యుడుగాడుగదా! అందువలన జనసామాన్యమున కావిద్య లందుబాటున నుండెడివిగావనియే చెప్పవచ్చును. అనేకవిద్యల నతిశ్రద్ధతో నంతకుపూర్వమే గ్రహించియున్న తిమ్మరుసునకు తనకు తెలిసిన ఛప్పన్నవిద్యలును, కళలును మిక్కిలిమక్కువతో గంగనామాత్యుడు నేర్పి, అతనిని సాటిలేని ప్రతిభావంతుని జేసెను. రమారమి యిరువది సంవత్సరముల వయసు వచ్చునప్పటికి తిమ్మరుసు సంస్కృతాంధ్రములయందు సంపూర్ణ పాండిత్యమును, గణితావిద్య నైపుణ్యమును గడించి, కింజల్కుని నీతిశాస్త్రము, దండనీతి, అమాత్యోత్పత్తీయము, తంత్రయుక్తులు మున్నగు మహావిషయములను గూర్చిన పరిజ్ఞానము ప్రధాని సహాయమున మెండుగా నార్జింపగలిగెను. ఇట్లు కొంత కాలము జరిగినది.

ఒకనాటిమధ్యాహ్నము గంగనమంత్రి ఆలోచనామందిరమున నొంటరిగ కూర్చుండి, సేవకునిబిల్చి, తిమ్మరుసుని గొనిరమ్మని యాజ్ఞాపించెను. వెంటనే అతడు తిమ్మరుసుని దోడ్కొనివచ్చెను. తిమ్మరుసు విజ్ఞాననిధియగు ప్రధానికి భక్తిశ్రద్ధతో నమస్కరించి నిలువబడెను. అంతట ప్రధాని సేవకుని బంపివేసి తిమ్మరుసున కుచితాసనము జూపి, అనురాగముట్టిపడ— "తిమ్మరుసూ! నీసుగుణసంపత్తికి మెచ్చి

తిని. నీ ప్రజ్ఞా విశేషములు కొనియాడ దగినవి. చూచితివా! నీ పూర్వులందరు మంత్రిపదవుల నుండి ప్రఖ్యాతి నార్జించిరి. వారికంటెను, మాకంటెను నీవు అత్యధిక శక్తిసామర్థ్యములు గలవాడవై ఉత్తమ స్థానము నలంకరించి ఈ దక్షిణ హిందూస్థానము నంతకు సర్వాధికారివై నేర్పుతో పరిపాలింప గలవని నేను గ్రహించితిని. నిను బోలు సమర్థతగల విద్యావిశారదుడు నేడు మఱియొక డీ రాజ్యమున గనుపించుట లేదు. నేను వృద్ధుడ నైతిని. ఇంకను బ్రతికినంతకాలము బ్రతుకబోను. ఈ ఆంధ్ర సామ్రాజ్యమునకు నా తరువాత నీవే మంత్రివగుదువు. ఈ రాజ్యమును రక్షింపవలసిన భారము నీ యందున్నది. ఈమాట మఱువకుము. ఒకవంక నొడ్డెరాజులైన గజపతులు, మఱియొకవైపు బలవంతులైన బహమనీసుల్తానులు ఈ రాజ్యమును కబళింప వేచియున్నారు. మఱియు విద్యానగర సామ్రాజ్య మిపుడు మంచిస్థితిలో లేదు. ఇవన్నియు నీవు చక్కగ నర్థము జేసుకొనవలెను. నా యనంతరము నీవు మహామంత్రి వైనపుడు హైందవ ధర్మసంరక్షణార్థమై స్థాపితమైన యీ సామ్రాజ్య రక్షణమే ముఖ్య కర్తవ్యముగా భావించి నాకోరిక లీడేరునట్లు వైరివర్గము నంతరింపజేసి ఆంధ్రసామ్రాజ్య స్థాపనాచార్య బిరుదమును సంపాదింపుము. నీవాచరింప వలసిన విధ్యుక్తధర్మ మదియే! నీవు ప్రాణములతో నున్నంతవఱకు దీనిని మఱువకూడదు. ఇందుకు తప్పనని దైవముఖముజూచి ప్రమాణము చేయుము" అనెను.

తిమ్మరుసప్పుడు సంతోషాతిరేకమున నుప్పొంగుచు "అమాత్యవర్యా! మహాప్రసాదము. ఇంతకన్న పరమోత్కృష్టమైన కార్యము నాకు మఱియొండు లేదు. నా ఆశయము గూడనదియే—ఆంధ్రసామ్రాజ్యాభివర్ధనమునకై నా జీవితమును ధారవోయుదును. ఇట్టి అవకాశము నాకు గల్పించి నన్ను కృతార్థుని గావించితిరి. తమ యభీష్టమును తీర్చుట కన్న నాకు చేయవలసిన దేమున్నది—గురువర్యా! ఆశీర్వదింపుము. తమ దయావేశమున ప్రజలమన్ననలకు పాత్రుడనై ధర్మసంరక్షణార్థము నా జీవితమును వినియోగించెదను. విశ్వసింపుడు." అని విధేయుడై యనెను.

ఆ మాటల కాప్రధాని పరమానందమును బొందుచు "తిమ్మరుసూ! నీవంతటివాడవే! నీయందు నాకు మిక్కిలి విశ్వాసమున్నది. ప్రస్తుతము నీవు గుత్తిదుర్గమునకు ప్రభువైన సాళువ నరసరాజునకు ప్రధానిగానుండుము. మా సార్వభౌముని అంగీకారమును బడసియే నిన్నిట్లు చేయుచున్నాను. అచిరకాలమున మీ సోదరుల కిర్వురకు వివాహములు జరుపగలను. నీవా నరసరాజునకు మంత్రివై నీప్రతిభను ప్రదర్శింపుము." అనెను.

"చిత్తము! తమ ఆజ్ఞలను శిరసావహింతును" అని తిమ్మరుసనెను. అంతట ప్రధాని "మఱియొక ముఖ్యవిషయమును చెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము. ఇప్పుడున్న అవకాశములను బట్టి చూడగా విద్యానగర రాజ్యము నేవేళనో బలవంతులగు బహమనీసుల్తానులాక్రమింప గలుగుదురు.

అప్పుడు హైందవ సామ్రాజ్యమునకు ముప్పువాటిల్లగలదు. కాబట్టి విద్యానగరమును ప్రప్రథమమున మనము వశపరుచుకొనవలసియున్నది.” అనెను.

“ఇప్పుడే ఆప్రయత్నముల సాగించెదను. మఱియు కృష్ణానదికి దక్షిణభాగమునుండి యశ్వపతులను, గజపతులను, బాఱద్రోలి తమ యాజ్ఞానుసారము సాళ్వనరసింహ భూపాలుని కర్ణాటక సామ్రాజ్యమునకంతకు చక్రవర్తిని జేయగలను...” అని చెప్పుచుండగనే ఆవృద్ధమంత్రి తిమ్మరుసు భుజముతట్టుచు వాత్సల్యమున “మంచిది. నాకోర్కె దీర్చగలవు. పోయిరమ్ము. నీకుసేమమగుగాక!” అని దీవించి యతనిని పంపెను.

౨

తిమ్మరుసిప్పుడుమంత్రి—సాధారణమైన మంత్రిగాదు, సర్వతోముఖప్రజ్ఞగలమంత్రి—అతనికొక మహామేధావియగు ప్రధానికుండవలసిన లక్షణములన్నియు నమరినవి. అన్నియు శుభములే-అంతయు ఆనందమే!- ప్రజ్ఞాబల ప్రాభవోన్నతుల ప్రకటించుట కిప్పుడు తిమ్మరుసునకు మంచి యవకాశము లభించినది. ఇట్లుండగనే తిమ్మరుసునకు అతని తమ్మునకు వివాహములు జరిగినవి. తిమ్మరుసు తుళువ నరసింహ ప్రభునియొద్ద మంత్రిగానుండి తన కార్యనైపుణ్యమును జూపుచు, భూపాలునిచేతను ప్రజలవల్లను కొనియాడబడుచుండెను. అచిరకాలమున కతని యశోవైభవము నలుదిక్కుల వ్యాపించినది. నరసరాయడిపుడు తన ఖడ్గనైపుణ్యమునకు దోడు సమర్థుడగు తిమ్మరుసు బుద్ధిబలమును లభించుటనుజేసి శత్రువులకు దుర్నిరీక్ష్యుడయ్యెను. బహామనీ సుల్తానులు, గజపతులు, నరసరాయుడన్న భయపడసాగిరి. ఇంతటి మంత్రిపుంగవుడు లేడని అప్పుడే తిమ్మరుసు పేరు దేశమందంతటను వ్యాపించినది.

కొంతకాల మిట్లు జరిగినది. అప్పుడప్పుడు తన గురు తుల్యుడగు గంగనామాత్యుని దర్శనము చేసి వివిధ విషయ ముల ముచ్చటించుచు అమూల్యములగు ఆ మహాశయుని సలహాలను స్వీకరించుచు అతని అనుమానములను దీర్చుకొనుచుండెడివాడు.

కాల మనేక మార్పులు గలది. ఈ విచిత్ర పరిభ్రమణమునం దనేకములైన సంఘటన లేర్పడుచుండును. రాజును కింకరునిగాను కింకరుని రాజుగాను మార్చగల శక్తి కాలమున కున్నది. తదనుగుణ్యముగనే మానవుల బుద్ధులుగూడ మారుచుండును. అన్నియు మంచివేనని చెప్పుచు సంభవించిన వాటిని స్వీకరించి సంతోషమున నెడుకొను ధీమంతులు కొందఱున్నారు.

భయంకరమగు దరిద్రమను పెనుభూతమునకు వెరవక ధీరులై చాకచక్యముతో పోరాడి తమయభీష్టముల నెరవేర్చుకొని సంపదలతో తులతూగిన చతురులు పలువురుగలరు. ఇట్టి నిపుణు లే కాలమునందైనను ఎట్టి క్లిష్టపరిస్థితులయందైనను రాణించగలరు.

తిమ్మరుసున కిప్పుడు ప్రవికముగ నొక శోకము కలిగినది. ఏ మహాశయుడు తనకు విద్యాదానము జేసి అనుగ్రహించెనో, ఏమహాత్ముడు తనయభివృద్ధిని తన్నింతవారముగా నివచ్చెనో, ఏవిశాలహృదయుడు హైందవ సామ్రాజ్యమునకు తనను మహామంత్రిని జేయ నువ్విళ్లూరుచుండెనో, ఆలోక బాంధవుడు నాడెల్ల చిట్టిగంగనామాత్యుడు మరణించెను.

తిమ్మరుసున కది తీరని లోటుకదా! విధివిధానము నెవరు తప్పింపగలరు?

గంగనామాత్యునిమరణము తిమ్మరుసున కొక విధముగ నూతనో త్తేజమును గలిగించినది. ఆమహనీయుని కోరికలను సత్వరముగ దీర్చవలెననియు, ఆయన ఆజ్ఞలను వెంటనే నెరవేర్చవలెననియు తలచుచున్న తిమ్మరుసున కిప్పుడుద్రేకము జనించినది. ఆనాడు తనకు గంగన చెప్పిన పవిత్ర వాక్యము లిప్పుడు తిమ్మరుసునకు స్ఫురణకువచ్చినవి. ఆ ఉపదేశములిప్పుడు తిమ్మరుసునకు హెచ్చరికను దెల్పుచున్నవి.

క్రమక్రమముగ కర్ణాటసామ్రాజ్యమునవల్లకల్లోలములు ప్రబలెను. ప్రభువైన విరూపాక్షరాయలు సురాపానమత్తుడై స్త్రీలోలుడై దుర్మార్గుడగుట ప్రజాకంటకుడయ్యెను. నిరంతర మతడు భోగలాలసుడై యంతఃపురమును దాటిరాక, మంత్రులకుగాని, సేనాపతులకుగాని మోమైనజూపక మైమరచి విహరింపుచుండెను. రాజకార్యములు వాడగుచున్న వనియు, ఈ ప్రవర్తనము తగదని కొందఱు దండనాథులు సాహసించి మందలింప విరూపాక్షరాయలు క్రూరుడై వారిని చంపించెను. సంస్థానమందలి అధికారు లెవరియిష్టము వచ్చినట్లు వారు తమ యధికారములు జలాయించ సాగిరి. సామంత భూకాంతులు స్వతంత్రులై యెవరి రాజ్యములను వారు పాలించుకొనుచు కప్పములు గట్టుట మానివేసిరి. రాబడితగ్గిన కొలంది ప్రజలకు బన్నులు అధికముగ విధింబబడెను. చెల్లింపని వారిని బంధించి, చెఱసాలలందుంచు చుండిరి. ప్రజలలో

దిరుగుబాటు ప్రారంభించినది. పశ్చిమ సముద్రతీరమునందలి రేవు లనేకము పరాధీనమైనవి. ఈ పరిస్థితులన్నియు దన చారులవలన తిమ్మరసుమంత్రి చక్కగా గ్రహించెను.

లభించిన అవకాశమును సద్వినియోగము జేసుకొను టలో తిమ్మరుసు మేటి — అతడు సమయమును గమనించి విరూపాక్షరాయలను తొలగించుట కిది చక్కని సమయమని యూహించి, తన గూఢచారులను, దండనాథులను కొంద ఱిని విద్యానగరమునకు బంపి అక్కడ చేయవలసిన పను లను, ఉపయోగింపవలసిన తంత్రములను రహస్యముగ చేయించుచుండెను.

ఒకనాటి సాయంకాలము రాజభవనమున నరసరాయ లేకాంతముగనుండ తిమ్మరుసు సమీపించెను. ప్రభువు మంత్రిని గూర్చుండ నియోగించిన పిమ్మట యిరువురు వివిధ రాజకీయ వ్యవహారములు ముచ్చటించుకొనిరి. పిమ్మట తిమ్మరుసు "ప్రభూ! విరూపాక్షరాయల దుర్నడతయు దారాగ్యస్థితియు వినుచున్నారుగదా! సర్వకాల సర్వావ స్థలయందును అతడు అంతఃపురమును విడిచిరాక, కామినీ లోలుడై, రాజ్యమున కింతింతనరాని అపకారమును జేయు చున్నాడు. ఈసమయమును గనిపెట్టి బహామనీసుల్తానులు విద్యానగరమును మ్రింగివేతురేమో! అట్టిది సంభవించిన మన రాజ్యమున కెంతి ముప్పురాగలదు ? మన ముప్పు దుపే క్షించి, ఈ యవకాశమును జారవిడచిన మనకు మనమే హాని కలుగ జేసుకొన్నవార మగుదుము. ఏమందురు ?" అనెను.

నరసరాయ డీ మాటలు విని, తిమ్మరుసు మోమును తేరిపాఱజూచి, "మంత్రీ! నీ దూరదృష్టితో కూడిన యాలోచనకు సంతసించితిని. నీవు చెప్పినది సత్యము. ఈ సమయమును మనము వృధా చేయరాదనియే నాకును దోచుచున్నది" అనెను. అంతట తిమ్మరుసు మన రాజకీయ గురువైన గంగనామాత్యుడు మనకు బోధించిన పరమధర్మ మిదియే ప్రభూ! మన మిప్పుడే ఈ కర్ణాటప్రభుని సింహాసనమునుండి తొలగించి, సాళ్వ నరసింహ భూపాలుని సార్వభౌమునిగ జేసి పట్టాభిషేకము జేయింతము—" అనెను.

ప్రభువా వాక్యముల శ్రద్ధతో నాలకించి, ఒక క్షణ మాలోచించి, తల యూపుచు, "తిమ్మరుసూ! నీ బుద్ధికి మెచ్చితిని. నాకు తగిన మంత్రివి నీవొకడవే! కానిమ్ము, మనమిక జాగు సేయరాదు. మన యుద్యమ మెవ్వరికిని దెలియకుండ హఠాత్తుగ దండెత్తిపోయి విద్యానగరముమీద బడవలెను. లేనియెడల మన కనేక ప్రతిబంధకము లేర్పడి, విరోధులవలన మన యత్నము లన్నియు విఫలము గావచ్చును. ఎన్నివిధముల నాలోచించినను ఆలసించుట కూడదని తోచుచున్నది. నీవు కాలయాపన చేయక వెంటనే మన సైన్యముల సమకూర్చి సిద్ధము చేయించుము. కావలసిన యేర్పాటు లతి త్వరితగతిని జరుగవలెనని దండనాథులను సేనాపతులను రావించి ఆజ్ఞాపించుము. ఆజ్ఞ మీరిన క్రూరమగు శిక్షలని హెచ్చరిక జేయింపుము— మన మిప్పుడే యీవిషయములు సాళ్వనరసింహభూపాలునకు దెలియజేసి

మునకు సహాయార్థము కొంత సైన్యమును దెప్పించుకొనవలసి యున్నది. అంచలమీఁదనేగి రాగల సమర్థుల నిందులకు నియోగించి అప్రమత్తుడవై మెలంగుము. సర్వము సిద్ధము జేయింపుము" అని ఉత్సాహమున బలికెను.

రాజీవిధముగ ఆజ్ఞనిడి లేచివెళ్లెను. తిమ్మరుసు పరమానందభరితుడై, అప్పటికప్పుడే సాళ్వనరసింహరాయలకీ సందేశమును బంపి, మిగిలిన పనులన్నియు తాను స్వయముగ జూచుచు, దండనాథులను, సేనాపతులను రావించి, జరుగవలసిన యేర్పాటు లన్నియు లోటులేకుండ జేయించెను. అంతకుపూర్వమే తిమ్మరుసీ ప్రయత్నమున నున్న వాడగుట అచిరకాలమున కంతయు సిద్ధమయ్యెను. ఒకసుముహూర్తము నిర్ణయింపబడెను.

శుభము లరుదెంచు వేళ నన్నియు శుభములే దోచుచుండును. తిమ్మరుసుమాట కిప్పు డెదురాడువారు లేరు. అతడేది తలచిన నది జరుగవలసినదే. తిమ్మరుసు రాజనీతి ననుసరించి విద్యానగరమందలి దండనాథులను సైన్యాధ్యక్షులను తనవశము గావించుకొనెను. నరసరాయని పేరున కొందరికి గానుకలంపించెను. ఈవిధముగ తనమార్గమును చక్క జేసుకొని సులభసాధ్యమగునట్లు గావించెను.

పెట్టిన శుభముహూర్తము సమీపించినది. వీరు తలపెట్టినకార్యమున కామోదించుచు, సాళువ నరసింహరాయలు కొంతసైన్యమును, కొందరు దండనాథులను, సేనాపతులను సహాయార్థము పంపెను. వెంటనే ప్రయాణ భేరి

ప్రయోగించెను. తిమ్మరుసు మంత్రిపుంగవుడే గాక సమగ్రకము మెఱింగిన మహాయోధుడు నై యుండెనుగదా! నరసరాయునితో పాటు తిమ్మరుసుకూడ దండయాత్రకు బయలుదేరెను. గుత్తిదుర్గమునుండి సమధికసేనలతో సమరోత్సాహులై వెడలి విద్యానగరమును ప్రవేశించి నగరి వెలుపల విడిసిరి. అప్పుడు తిమ్మరుసు కర్ణాటనగర సంరక్షకులైయుండిన సామంతులకు, దండనాథులకు తాను రచించిన కార్యావసరముల గూర్చిన విషయములు దెలుపుచు లేఖలను వ్రాసి పంపెను. సాళువ నరసింహరాయుల సహాయసంపత్తిగల తుళువనరసరాయుల నెదుర్కొనుట కెవరు సాహసింతురు? ముందున కెవ్వరును వచ్చి యుండలేదు. ఇట్లు విద్యానగరమతి సులువుగ తమకు వశమగుటగాంచి తిమ్మరుసు తన సేనలను నడిపించుకొనుచు రణభేరి మ్రోగించి నగరముసొచ్చి మహదానందమున నూరేగుచు రాజభవనమును సమీపించి ద్వారపాలకుల నుక్కడగించి అంతయు స్వాధీనపరచుకొనుచుండెను. ఈ సంగతి సురాపానమత్తుడగు విరూపాక్షరాయలకు తెలియగనే అతను స్వప్రాణరక్షణార్థ మంతఃపురము వీడి దొడ్డవాకిట తప్పించుకొని నగరమువిడిచి పారిపోయెను. నరసరాయుడు భాండారమును, నగరమును స్వాధీనపరుచుకొని జయభేరి మ్రోగించెను. దుర్మార్గుడగు విరూపాక్షరాయుల నసహ్యించుకొనుచుండిన విద్యానగరవాసు లీ మార్పునకు సంతోషించి, నరసరాయుని సగౌరవముగ వినయవిధేయతలతో నాహ్వానించిరి. గాని నరసరాయునికి విరోధులు

లేకపోలేదు. స్వల్పసంఖ్యాకులగు కొందరి కిది సమ్మతము గాకపోయినను, శక్తిహీనులగువారు నరసరాయుని నెదుర్కొన జాలకపోయిరి. చతురమతియైన తిమ్మరుసు వెంటనే అట్టివారిని మఱికొందఱు రాజబంధువులను విద్యానగరము నుండి తరిమివేయించెను. తన కనుమానముగ నున్న మఱికొందఱిని చంద్రగిరికి, పెనుగొండకు బంపివేసి తనమార్గమును చక్కజేసుకొనెను. తమవిజయమును సాళ్వనరసింహరాయనికి దెలియజేయు సందేశమును బంపి, పట్టాభిషేకమునకు దయచేయవలసినదని ఆహ్వాన మంపెను.

౬

విద్యానగరమంతయు నరసరాయనికి గడగడ లాడు చుండెను. ఆస్థానమందును, అంతఃపురమందును సందేహము గల నౌకరులను దొలగించి క్రొత్తవారిని నియమించిరి, తమ కనుగుణ్యముగ పరిపాలనా పద్ధతులను మార్చి, నూతన విధులను ప్రవేశపెట్టిరి. సాళువ నరసింహరాయని పట్టాభిషేక మహోత్సవమునకు శుభలగ్నమును పెట్టించి, సామంత నృపతులు మున్నగువారి కాహ్వాన పత్రికలు బంపిరి. నగర మంతయు పచ్చని తోరణములతోను, చిత్రవిచిత్రములగు అలంకారములతోను నమర్చి నేత్రపర్వముగ నొనర్చిరి.

శుభవార్త వినుటయె తడవుగ సాళువ నరసింహ భూపాలుడు రాజ్యకార్య ధురంధరుండగు తిమ్మరుసు ప్రజ్ఞా విశేషముల కచ్చెరువందుచు జాగుసేయక మంత్రులను సేనాపతులను సామంతులను, రాణులను, పుత్రులను పరివార జనంబులను వెంటగొని నారాయణవనమునుండి విద్యానగరమునకు బయలుదేరి వచ్చెను. మంత్రియగు తిమ్మరుసు సేనాపతులతోను పురజనులతోను యెదురుగావచ్చి సన్మానములతో నరసింహరాయలను గొంపోయి రాజభవనమున ప్రవేశపెట్టెను. నరసింహరాయలు విద్యానగరమునకు క్రొత్త వాడు కాదుగదా! ఆ రాజపుంగవుని కీర్తి దశదిశల వ్యాపించినది. ప్రజలాతని ప్రేమించి తమ అంగీకారమును

వెలిబుచ్చుచు ఆనందించిరి. బలవంతుడును, సమర్థుడును, గుణ వంతుడును నగు నరసింహరాయల పట్టాభిషేక మహోత్సవ మున కామోదించుచు, నగరమంతయు సంతోషమున కల కల లాడుచుండెను. ఉత్సవసందర్భమున పలువిధములగు వినోదములు వింతలు జరుగుట కేర్పాటులు గావింపబడినవి. ప్రసిద్ధులగు కవులు, గాయకులు, నర్తకులు ఆహ్వానింపబడిరి. ఆ మహోత్సవమును కన్నులార గాంచి యానందించుటకు పలువురు సామంత భూనాథులు కానుకలు గొనివచ్చిరి. ఉత్సాహము నిండిపోయెను.

శుభముహూర్తమున మంగళవాద్యములు మ్రోగు చుండ, పండితకవుల ఆశీర్వచనములు చెలరేగ జయజయ ధ్వానములు మిన్ను ముట్ట, మహారాజాధిరాజ, రాజపర మేశ్వరేత్యాది బిరుదాంకితుడై వరలుచు నరసరాయుడును తిమ్మరుసును చెంతనిల్చి సపర్యల జేయుచుండ సాళువ నర సింహరాయలు కర్ణాట సామ్రాజ్యమున పట్టాభిషిక్తుడయ్యెను. ఆపవిత్ర శుభసమయమున కవులకు, గాయకులకు, పండితులకు సముచిత గౌరవము లభించి, ఉచిత సత్కారము జరిగినది. అనేక దానశాసనములు వ్రాయబడినవి. నూతన తటాక ములు, ధర్మశాలలు నిర్మించుట కేర్పాట్లుజరిగినవి. పౌరుల కోర్కెలను మన్నించుట కనువగు నేర్పాటులు జరిగినవి. అందరన్నివిధముల సంతోషించిరి. సంస్థానమందలి సిబ్బందికి వేతనములు హెచ్చుగావింపబడి, మరికొందరికి నూతనో ద్యోగము లిప్పింపబడినవి.

వినోదములకును, కౌతుకములకును సార్వభౌముడు స్వయముగ విచ్చేసి, ఆనందించెను. గుఱ్ఱపుపందెములు, మల్లయుద్ధము, ముష్టియుద్ధము మున్నగు ప్రదర్శనములకు సార్వభౌముడమితోత్సాహమును జూపెను.

కర్ణాటసామ్రాజ్య మిప్పుడు సంపూర్ణముగ నాంధ్రులకు స్వాధీనమయ్యెను. మరియు చంద్రగిరి విజయనగర సామ్రాజ్యము ఏకమగుటవలన ఆంధ్రరాజ్యము చాలవరకు బలపడుటయేగాక తెలుగువారికి బలుకుబడి అధికమయ్యెను. తిమ్మరుసుమంత్రి కిప్పుడు తన ప్రజ్ఞావిశేషముల వికసింపజేసుకొనుట కొక చక్కని అవకాశమేర్పడినది. సాళ్వ నరసింహభూపతికి తిమ్మరుసునెడ మంచి విశ్వాసము కుదిరినది. అతని ననేక విధముల సత్కరించి గౌరవించెను. ఒక సమయమున సార్వభౌముడు తిమ్మరుసును బిలిచి "మంత్రి గంగనామాత్యుడు గతించిన పిదప మఱల నంతటి వాడవు నీ వొక్కడవె గనుపించుచున్నావు. ఆయన స్థానము నాక్రమించ గల సమర్థులింతవఱకు గోచరింపక పోవుటవలన నేనెంతయో విచారించు చుంటిని — నీవా స్థానమున నుండి ప్రధానమంత్రి పదవిని వహింపుము—" అనెను. అందులకు తిమ్మరుసు "చిత్తము. మీయాజ్ఞ శిరసావహించ వలసినదే! నాయందు తమ కింతటి సదభిప్రాయము గలిగి నందులకు సంతోషముగాని, క్షమింపుడు. ప్రస్తుతము నే నాపదవి స్వీకరింప జాలను."

సార్వ:— కారణము?

తిమ్మ:— నాకట్టి యర్హత లేదేమోనని తలంచుచున్నాను.

సార్వ:— వెఱ్ఱివాడవు! నీ బలము నీకు దెలియదు. మువ్వాటికి ఆపదవికి నీవొక్కడవే సమర్థుడవు నీ ప్రతిభా విశేషములను గ్రహించితిని. నీకు నీవే సాటి........

తిమ్మ:— కృతజ్ఞుడను. నాయందు తమకుగల గాఢానురాగమే తమకట్లు గోచరించుటకు కారణముగావచ్చును. అదియునుగాక యిందులకు మఱియొక హేతువుగూడ నున్నది.

సార్వ:— మఱియొక హేతువా!

తిమ్మ:— చిత్తము. నాకన్న వృద్ధులెందరో తమ యాస్థానమున నుండిరిగదా!

సార్వ:— ఉండవచ్చును. బుద్ధివిశేషములకు వయసు ప్రధానమా? మహామంత్రి పదవిని స్వీకరించుటకు గావలసినది వృద్ధులుగారు. ప్రతిభా సమంచిత ప్రాజ్ఞులు.

తిమ్మ:— తమకు ప్రత్యుత్తర మీయగల వాడనుగాను, గాని తమరొకటి ఆలోచింప వలసియున్నది. చిరకాలమునుండి మిమ్మాశ్రయించుకొని భక్తిశ్రద్ధలతో కొలుచుచున్న మంత్రి పుంగవులుండిరిగదా! వారల గాదని చిన్నవాడనగు నే నాపదవిని స్వీకరించుట ధర్మముగాదు. మఱియు క్షేమముగాదు. అనవసరమగు మిత్రభేదములకు హేతువగును. అందువలన దేశము శాంతి భద్రతలతో నుండదని నామనవి.

సార్వ:—తిమ్మరుసూ! ఎంతదూర మాలోచించితివి! నాకు

నచ్చజెప్పుట కెంత చక్కని సమాధాన మాలోచించితిరి! ఎంతటి బుద్ధిశాలివి!

తిమ్మ:—తమరట్లు భావింపవలదు. నేను ప్రధానమంత్రిపదవి స్వీకరించకపోయినను, ఆపదవియం దున్నట్లే ప్రవర్తించెదను. సామ్రాజ్యముపట్ల సదా సేవానిరతుడనై యుండ గలను. కొంతకాల మిట్లు జరుగుట శ్రేయస్కర మని నాకు తోచుచున్నది.

సార్వ:— అట్లే కానిమ్ము. ఈ యాలోచనగూడ మంచిదే!

అని నరసింహరాయలు తిమ్మరుసును మెచ్చుకొనెను. కొంతకాల మందరు విద్యానగరమున నుండిరి. పిమ్మట నరసింహదేవరాయలు నారాయణవనమునకును, నరసరాయలు గుత్తికిని తరలి వెళ్లిరి.

అవివేకియగు విరూపాక్షరాయలు మూలమున విద్యానగర రాజ్యమున అల్లకల్లోలములు చెలరేగి యుండెను. ఇప్పుడు వాని నన్నిటిని సర్దుబాటు గావించి సంస్కరింపవలసిన పని యెంతయో గలదు. తిమ్మరు సతి శ్రద్ధతో నాభారమును వహించెను. ప్రప్రథమమున అధికారవర్గమునగల అవకతవకలను రూపుమాపి, విశ్వాసపాత్రులగు సమర్థులకే యాపదవులను నప్పగించెను. అటుపిమ్మట నగరరక్షణమునకు వలయు కట్టుదిట్టములను జేయించెను. తదనంతరము పరిసరదుర్గముల బలపరచి శత్రుభయము లేకుండ జేసెను. క్రమముగ నిట్లన్నియు జక్కజేసుకొని వచ్చిన పిమ్మట, స్వాతంత్ర్యమును బ్రక

టించి కప్పముల గట్టుట మానివేసిన సామంతనృపతులను మఱల స్వాధీనమునకు రప్పించుకొనెను. విశ్వాసపాత్రులగు వారిని సేనాపతులుగ నియమించెను. దేశమంతటను నిపుణు లగు గూఢచారుల నియోగించి సమాచారముల నెప్పటి కప్పుడు తెలియజేయునట్లు కఠినముగ శాసించెను. అంత టితో ముగించక, తన తమ్ముడైన గోవిందరాజును కర్నాటక సైన్యమునకునాయకునిగాఁ జేసి నగరసంరక్షణ భారమంతయు నాతనియందుంచెను. రాజ్యమునందుగాని, అంతఃపురము నందుగాని తిమ్మరుసునకు దెలియకుండ నేపనియు జరుగరాదు. అందరు అతనికి భయపడి దోసిలొగ్గుచుండిరి. ఇప్పటికి మఱల విద్యానగరము సురక్షితమైనది.

౭

సురక్షితమైనది విద్యానగర సామ్రాజ్యము. ప్రజలు శాంతముగ సుఖించుచున్నారు. గాని, ఆ శాంతి, ఆ సౌఖ్యము తిమ్మరుసున కేవి? ఇప్పుడతని బాధ్యత మఱింత మిక్కుటమైనది. అవసరమైనప్పుడెల్ల సాళ్వ నరసింహభూపతి తిమ్మరుసును తనయొద్దకు రావించుకొని వివిధ విషయముల ముచ్చటించుచు ఆలోచనల నడుపుచుండెను. నరసరాయ డించుమించుగ రాజ్యభార మంతయు మంత్రిపుంగవునిమీఁద నుంచెను. తిమ్మరుసే రాజ్యచక్ర మంతయు నడుపవలసి వచ్చెను. అట్టి తరి యాతనికి సౌఖ్యపడుట కవకాశమేది? చిత్తశాంతికి వీలెక్కడ? మఱియొకప్రక్క గంగనామాత్యునికి తాను జేసిన వాగ్దత్తములు— ఆ గురుదేవుని పవిత్ర వాక్యము లాతని స్మృతిపథమున నెల్లప్పుడు మెలగుచుండెను. సర్వకాల సర్వావస్థలయందును తిమ్మరుసునకు రాజ్యమును గూర్చిన చింతయే. అతని యాలోచనల కంతులేదు. చేసెడి ప్రయత్నములకు హద్దులేదు.

"నరసింహ సార్వభౌముని కోర్కె దీర్పవలసినదే. ప్రబల శత్రువులగు అశ్వపతులను, గజపతులను, బాఱద్రోలు

నంతవరకు నాకు నిద్రపట్టదు." అవికదా ఆ మహాప్రభు వన్నది! సత్యమే. విరోధులు పొంచియుండ నిద్దురెవరికి పట్టును? గంగనామాత్యుని కోరికకూడ నిదియే- ఎన్నివిధముల నాలోచించినను నా ప్రథమ కర్తవ్య మిదియే....ప్రస్తుతము మనకు బలము చాలునా? శక్తిగలదా?....ఉన్నది. లేకేమి? మానవశక్తికి మించినదేది? మనసుండిన మార్గములనేకములు- కావలసినది గట్టి ప్రయత్నము- తదేకదీక్ష- ధృఢమైన సంకల్పమున్న నేకార్యము కొనసాగదు? అశ్వపతులకు అశ్వములు మెండనియు, గజపతులకు గజములు మెండనియు, తలచి, కావలసినంత ద్రవ్యమును వెచ్చపెట్టి, ఆ రెంటిని సమకూర్చుట కాజ్ఞాపించితిని. ఈసరికి కావలసినన్ని అశ్వములు గజములు చేరియే యున్నవి. సార్వభౌముడీవిషయమున శ్రద్ధవహించి, బొక్కసమునందలి ధనమంతయు వ్యయము జేయుచున్నాడు. అరబ్బీ దేశమునుండియు, పారసీక దేశమునుండియు ఇటీవల వర్తకులు దెచ్చియిచ్చిన గుఱ్ఱములు శ్రేష్ఠములైనవి. అట్టివే మఱికొన్నింటిని గూడ గొనిరమ్మని యాజ్ఞాపించితిని. సేనాపతులును, దండనాథులును ఉత్సాహ క్రియాశక్తులు గలిగి శత్రుభయంకరులై యున్నారు. పదాతిసైన్యము మన కమితముగ నున్నది. వీటన్నిటికి దోడు కాలము మన కనుకూలముగ నున్నది. ఇంకేమి లోటు? అశ్వపతులైన బహామనీసుల్తానులను, గజపతులైన కళింగ దేశాధీశ్వరులను గూడ కృష్ణకు దిగువ భాగమునను౦డకుండ వెడల నడిపించుట కిదియె మంచితరుణము...." అని యను

కొనుచు విద్యానగరమందలి రాజమందిరమున గూర్చొని తిమ్మరుసు సాలోచించుచుండెను.

ఇంతలో నొక సైనికుడు దరుదెంచి మ్రొక్కి నిలువబడెను. తిమ్మరుసాతని జూచి "ఏమి ?" యని ప్రశ్నింప "గుత్తినుండి ప్రభువు లిచ్చటి కేతెంచిరి" అని చెప్పెను.

తిమ్మ:— ఎంతకాలమైనది !

సైని:— ఇప్పుడే !

తిమ్మ:— అంతఃపురమున కేగిరా ?

సైని:— సభాభవనమున నున్నారు. మిమ్ములను.........

తిమ్మ:— పిలువమని చెప్పిరా ?

సైని:— చిత్తము.

తిమ్మ:— మంచిది, నీవు పొమ్ము.

అని సైనికుని బంపివైచి తిమ్మరుసు "ఏమిచిత్రము! తలవనితలంపుగా నిప్పుడు నరసరాయ దరుదెంచుట కేమి హేతువు? అంతటి యవసరమేమియు నున్నట్లు దోచుట లేదు. వచ్చుటే తడవుగ నాకొరకు పిలుపా? ఏముప్పును వాటిల్లలేదుగద! దర్శనముచేసి విచారించెదగాక!" అని యనుకొనుచు బయలుదేరి సభాభవనమున బ్రవేశించి నరసరాయని గలుసుకొని "ప్రభూ! సర్వమును భద్రమా!" అనుచు, కూర్చొనెను.

నరస:— భద్రమే ! ఇచ్చటి విశేషములేమి ?

తిమ్మ:— చెప్పదగిన విశేషములేమియు లేవు. తమ యాజ్ఞాను సారము నగర రక్షణమును కట్టుదిట్టము చేసితిని. అందరును జాగరూకులై ప్రవర్తించుచున్నారు.

నరస:— నగరరక్షణభారము గోవిందరాజులపై యుంచితివి గదా!

తిమ్మ:— చిత్తము.

నరస:— తిమ్మరుసూ! పారసీక దేశమునుండి వచ్చిన అశ్వము లెంత ముచ్చటగనున్నవి. చూడ సొంపగుచున్నది.

తిమ్మ:— అశ్వములకొరకు మనము ధనమును కొల్లబెట్టుచుంటిమని విని అచటి వర్తకులు ధనాశచే మంచిమంచి గుఱ్ఱములను దెచ్చి యిచ్చిరి.

నరస:— ఔను. సత్యముగ మనమెంతయో ధనము నీజంతువులనిమిత్తము ఖర్చుబెట్టితిమి. నరసింహరాయలు గూడ నిందుల కెంతయో సంతసించినాడు. ఇంకను ఖర్చు పెట్టుటకు సిద్ధముగనున్నాడు.

తిమ్మ:— సరిగాని ప్రభూ! తమ రిట్లు లకాత్తుగ బయలుదేరి వచ్చుటకు ప్రబల కారణముండునని తలంచుచున్నాను.

నరస:— నీయాలోచన లెప్పుడును సరియైనవే. సత్యమునే యూహించుచుందువు. అవసరమగు కార్యమే గలదు. మన మిప్పుడు నారాయణ వనమున కేగ వలసియున్నది. వింటిరిగదా, నరసింహరాయలునకు జబ్బుగా నున్న విషయము!

తిమ్మ:— ఔను. ఇప్పుడెట్లున్నది?

నర:— ప్రమాదమైన స్థితిలో. కావలసిన ఏర్పాటు లన్నియు జరుగుచున్నవి.

తిమ్మ:— సార్వభౌమునితో మాటమాట్లాడిరా?

నర:— నన్ను రప్పించుకొని చెప్పవలసిన మాట లన్నియు చెప్పినారు. తన పెద్దకుమారుని రాజును జేతురట. అతడు బాలుడగుటచే కార్యకర్తగా నన్ను నియమింతురట... నీవును నేను కలసి బాలరాజును, రాజ్యమును కాపాడవలెనని సార్వభౌము డానతిచ్చెను.

తిమ్మ:— చక్కని యేర్పాటు! ఇందులకందరును సమ్మతించిరా?

నర:— సార్వభౌముని కెవరెదురాడ గలరు? అదియునుగాక, ఈ మార్గమందరికి సమ్మతమే గదా!

తిమ్మ:— ప్రభూ! సార్వభౌము డింకను కొంతకాలము జీవించి యుండు నెడల నెంత బాగుండును! ఆయన కోర్కెలను దీర్చలేక పోతినిగదా యని విచారమగుచున్నది.

నర:— శత్రులను దరిమి వేయుటయేనా?

తిమ్మ:— చిత్తము. "ప్రబల శత్రువులగు బహమనీ సుల్తానులను, గజపతులను బారదోలువరకు నాకు నిద్రపట్టదు" అని నాతో రెండు మూడు పర్యాయము లన్నారు. అంత చురుకుగా యుద్ధప్రయత్నముల జేయించుట కదియే ముఖ్య కారణము. సార్వభౌముడీ విషయమున నెంతయో వేగిర పడుచుండెను.

నరస:— దైవవిధి యెట్లున్నట్లు జరుగగలదు. అప్పుడే యేమైనది ? ఆయు నింకను కొంతకాలము సుఖముగ నుండు నేమో ! విజయలక్ష్మిని చేపట్టు భాగ్యమున్నదేమో !

తిమ్మ:— అట్లే జరుగుగాక యని భగవంతుని ప్రార్థించు చున్నాను. ఏది ఎట్లున్నను మన మిక తడవు సేయరాదు. తగు సన్నాహముల గావించి వెంటనే దండయాత్రకు వెడలవలెను.

నర:— సార్వభౌము డొకవేళ గతించిన మన ప్రయత్నములు కట్టిపెట్టవలసి వచ్చునేమో ?

తిమ్మ:— కట్టిపెట్టు టెందులకు ? తమ గట్లేల తలంచవలెను ?

నర:— ఆయన మరణానంతర మేయే సంకటములు తల లెత్తునో ? ఎట్టిచిక్కులు సంభవించునో ?

తిమ్మ:— ఎన్ని యాటంకములు వచ్చినను దండయాత్ర నాప గూడదు ప్రభూ ! అట్టి యవకాశములకు వీలు గలుగ కుండ మనము గట్టి ప్రయత్నములను జేసి వెంటనే రణ భేరి మ్రోగించవలెను. కాలహరణము చేయుట క్షేమముగాదు.

నర:— తిమ్మరుసూ ! నేనుగూడ నట్లే యూహించుచున్నాను గాని, నరసింహరాయలు లేకుండ మన మాపని నిర్వహించ గలమా ?

తిమ్మ:— అదియును ఆలోచించదగినదే ! గాని, అంతమాత్ర మునకు కాగల కార్యముల నాపియుంచుట మేలుగాదు.

సర్వమును సిద్ధము జేయించితిని. స్థిరచిత్తమున మనవా రందరు దండయాత్ర కువ్విళ్ళూరుచున్నారు. ఈ సమయ మున గాకున్న మరల నింతటి యుత్సాహము గలుగదు. మఱియు కాలము దిరిగినకొలది అనేక సమస్య లుద్భ వించి అంతరాయము లేర్పడవచ్చును. అప్పుడు పరిస్థితు లెట్లు మారునో ఊహింపజాలము.

నర:—సత్యమే—నాకొక యనుమాన ముదయించుచున్నది. నరసింహరాయలు గతించి బాలరాజు ప్రభువైనచో రాజ్యమున కలతలు బయలుదేరునేమో! రాజబంధువులు భేదాభిప్రాయములు గలవారై అవినీతికి పాల్పడుదు రేమో! సమయ మరసి సామంత నృపతులు తలయెతుదు రేమో! దండనాథుల ప్రవర్తన మెట్లుండునో

తిమ్మ:—ప్రభూ! మీ యూహలన్నియు సమంజసములే. గాని తమ రనుకొన్నంతటి క్లిష్టపరిస్థితు లెన్నటికిని రావు. ఏమందురా! పేరునకు మాత్రము బాలరాజుగాని, కార్య కర్తలు మీరేగదా! కొలదిగనో గొప్పగనో శక్తికొలది తోడుపడుటకు నే నున్నాను. మీ రూహించిన వన్నియు జరుగకుండ ముందుగనే జాగ్రత్తపడి వలయు కట్టుదిట్ట ముల చేయించగలము. కఠినశాసనములతో హద్దుమీఱ కుండ జేయగలము. నిపుణులగు గూఢచారులు మన కున్నారు. అనుమానమున్న ప్రతి వ్యక్తిని రాజ్యమునుండి తరిమివేయించగలము. అవసరమని తోచినప్పుడు కొంద రిని బంధించి యుంచవలసి వచ్చును. అంతఃపురమునగాని

రాజ్యమునఁగాని మనకు తెలియకుండ నేపనియు జరుగ రాదని ఆజ్ఞాపించవలెను.

నర:— మంచిసలహా నిచ్చితివి. మఱియు కొంతకాలము మనము నారాయణవనమునందే యుండి ప్రతి విషయమును పరిశీలించుచు ఈ యేర్పాటు లన్నియు అమలులో పెట్టుదముగాక! ఇవన్నియు మఱియొకపర్యాయ మాలోచించవచ్చును. ప్రస్తుతము మనము బయలుదేరి వెళ్ళి సార్వభౌమునిస్థితి యెట్లున్నదో గమనించవలెను. అక్కడ వారేమి యేర్పాటులు గావించుచున్నారో మన మర్థము జేసుకొనవలసి యున్నది. లేచి వెళ్ళి ప్రయాణమై రమ్మా, ఇప్పుడే నేనుగూడ సిద్ధపడుచున్నాను.

తిమ్మ:—"చిత్తము" అని సెలవుదీసికొని వెళ్లెను.

౧

తా నొకటి దలచిన దైవ మొకటి దలచును. సర్వస్వతంత్రుడై ప్రజారంజకముగ రాజ్యమేలిన సార్వభౌముడు సాళువ నరసింహరాయలు మహాపరాక్రమవంతుడై, శత్రువీరభయంకరుడై, సకలగాంధర్వ విద్యాకళాప్రవీణుడై రాజ్యమును విస్తరింపజేసిన చక్రవర్తి సాళువనరసింహరాయలు-మహారాజాధిరాజ, రాజపరమేశ్వరేత్యాదిబిరుదాంకితుడై, సమున్నత విభవోజ్వలుడై, సునిశిత యశోవిరాజితుడైన రాజరాజు సాళువ నరసింహరాయలు దేహయాత్ర చాలించెను. ఇందులకు దుఃఖించని పౌరులు లేరు. చింతించని యోధులు లేరు. విచారపడని సామంతులు లేరు.

ఎందరు భూనాథులీ కాలగర్భమున కలిసిపోలేదు? ఎందరు శ్రీనాథులు మంటిపాలు గాలేదు? మరెందరు భోగులు, త్యాగులు, తపస్సంపన్నులు గతించిపోలేదు? ఎవరికి జాలి? కాలమాగునా? కాగల పనులు మానునా? శరవేగమును మించుచున్న దీ కాలగమనము-వారములు, నెలలు, సంవత్సరములు చూచుచుండగనే గడచిపోవుచున్నవి.

నరసింహరాయుడు స్వర్గస్థుడైన వెనుక పెద్ద కొడుకు తిమ్మరాయుడు సింహాసన మెక్కెను. ఇతనికి రక్షకుడుగా

నరసరాయుడు రాజ్యపాలనము నిర్వహింపసాగెను. సమర్థుడగు నరసరాజును, మేధావియగు తిమ్మరుసు మంత్రియు పరిపాలనాభారము వహించియుండ నే కొరత వాటిల్లును? అయ్యది రామరాజ్య మనియే చెప్పవచ్చును. పేరునకు మాత్రము తిమ్మరాయడు ప్రభువైనను, నరసింగరాజ్యమనియే ప్రజలు చెప్పుకొనసాగిరి. తిమ్మరు సనేక విధముల బాలరాజును రాజ్యమును కడుంగడు శ్రద్ధతో కాపాడి రక్షించుచుండెను. తిమ్మరు సిప్పుడు మహామంత్రిపదవిని విధిగా స్వీకరింపవలసి వచ్చినది.

ఎంత మంచితనమున్ననేమి? ఎంత శ్రద్ధగనున్ననేమి? ఎంతటి యోగ్యులకైనను కొందరు విరోధు లుందురు. సర్వరక్షకు డగు భగవంతుని దూషించు వారెందరు లేరు?

ఒకనాటి యుదయమున యథాప్రకారము తిమ్మరుసు రాజమందిరమున కేగు నప్పటికొక పిడుగువంటి వార్త వినవచ్చినది. గతరాత్రి విషప్రయోగమున బాలరాజు నెవరో దుర్మార్గులు చంపించిరి. ఎంతఘోరము! తిమ్మరుసా వార్త విని నిలువున నీరయ్యెను. ఒక్కక్షణకాల మతెడట్లే నిశ్చేష్టుడై నిలువబడెను. అతని కనేకాలోచన లుదయించినవి. ఏమిచేయుటకును దోచలేదు గాబోలు! అత డేకాంతముగ నొకచోట గూర్చొనెను.

అప్పుడే యావార్త నగరమంతటను వ్యాపించినది. ప్రజలెవరికి దోచినట్లు వారు చెప్పుకొనసాగిరి. రాజ్యము నపహరించుటకు నరసరాజే బాలరాజును జంపించెనని యొక

దుర్వార్త ప్రజలలో వ్యాపించినది. ఇందరికి దెలిసినప్పుడు నరసరాయునికి దెలియకుండునా! అత డతిత్వరితముగ వెతుకు కొనుచు వచ్చి తిమ్మరుసును సమీపించి "తిమ్మరుసూ! వింటివా యీఘోరము! అనెను.

తిమ్మ:— ఇప్పుడే వింటిని.

నర:— అప్పుడే ప్రజల నేకరకములుగ జెప్పుకొనుచున్నారట.

తిమ్మ:— ఔను! అన్నియు దెలియవచ్చినవి. రాజ్యాపహరణమునకై తమరే యిట్లు బాలరాజును జంపించియుందురని పౌరు లాడుకొనుచుండిరట.

నర:— ఈదుర్వార్త జనించుట కెవరు కారణమో?

తిమ్మ:— బాలరాజు మృతి కెవరు కారకులో వారే యీ పుకారును బుట్టించి యుందురు. ఆవిషయమే యింతవర కాలోచించు చుంటిని.

నర:— ఎవరై యుందురని నీయూహ?

తిమ్మ:— ఆ యాలోచనల కిది సమయముగాదు. ప్రప్రథమమునమన మొకపని చేయవలసియున్నది. తమరీ యపవాదునకు బలిగాకుండుటకై సాళ్వ నరసింహభూపాలుని ద్వితీయ పుత్రుని ఇమ్మడి నరసింహరాయుడను పేరుతో వెంటనే పట్టాభిషిక్తుని గావించవలెను.

నర:— అట్లే చేయుము. నాకును ఆపద్ధతి నచ్చినది. ఇందుల కేమాత్రము కాలయాపన తగదు. ఇప్పుడే తగిన వసతులను గల్పించి, వలయు నేర్పాటుల గావింపుము.

తిమ్మ:— చిత్తము.

అంతట నిరువురును కార్యాయత్త చిత్తులై లేచి వెళ్ళిరి.

మహామంత్రి తిమ్మరుసు తలపెట్టిన కార్య మేది సాగదు ! ఎవరాటంక పరచగలరు ? అప్పుడప్పుడే రాజ లాంఛనములతో ఇమ్మడి నరసింహరాయడు సింహాసనాసీను డయ్యెను. సకల సామంత నృపతులకును, నగరవాసులకును "ఇమ్మడి నరసింహరాయుడు సార్వభౌము"డని ప్రకటించిరి. రాచరికమంతయు యథావిధిగ నడచుచున్నది. ఈ యేర్పాటున కందరు సంతసించిరి. ఇప్పుడు నరసరాజుపై ప్రజల కధిక గౌరవభావ మేర్పడి యతనిని కొనియాడసాగిరి. నరస రాయుడు తనకు సంభవించిన యపనిందను బోగొట్టుకొను టయే గాక మునుపటికన్న మిన్నగ జనరంజకుడయ్యెను. కాలము జరిగిపోవుచున్నది.

అంతటితో తిమ్మరుసు పని పూర్తిగాలేదు. "తిమ్మ రాయని జంపిన దెవరు ?" ఈ ప్రశ్నయే మహామంత్రిని కల వర పెట్టుచున్నది. తిమ్మరుసు బుద్ధిబల మసమానమైనది. ఈ రహస్యము నతడు పటాపంచలు చేయలేడా ? ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టగల తిమ్మరుసు మంత్రి కీ విషయమెంత ? అతడు సత్యమును గ్రహించగలిగెను. నరసరాయునికి విరోధి యగు నొక దళవాయి బాలరాజును జంపించి, నరసరాయుని కా నేరము నంటగట్ట జూచెను. తిమ్మరు సీ రహస్యమును నరసరాయునికి మాత్ర మెరిగించి గూఢముగ నుంచెను.

తదాది నరసరాజు తిమ్మరుసు లిద్దరు ఆ నేరస్తుని ప్రవర్తనము నప్రమత్తులై కనిపెట్టుచుండిరి. క్రమక్రమముగ బాలరాజును జంపిన ఆద్రోహి తుళువ నరసరాయని మఱింత ద్వేషించుచు, నతని కపకారము జేయ ప్రయత్నించుచుండెను. ఆ నీచు డిప్పుడు ఇమ్మడి నరసింహరాయని దరిజేరి ఆతని ప్రేమ నార్జించి, తన కనుకూలుని గావించుకొనుచుండెను. నరస రాయు డిది గ్రహించి తిమ్మరుసును సమీపించి, ఆ క్రూరు డగు దళవాయి దుర్మార్గ మంత కంతకు హద్దుమీరుచున్నది. అతడు మనకు హాని కలిగించుటకై బాలుడైన మహారాజు నాకర్షించి యతనితో జెలిమి గావించుకొనుచున్నాడు."

తిమ్మ:— చిత్తము! భ్రాతృ హంతకుడైన వీనిని దరిజేర్చి బాలరాజు గౌరవించుచున్నాడు. అందువలన సంభవించు ముప్పు నాతడు గుర్తించజాలకున్నాడు.

నర:— ఇప్పట్టున మన ముపేక్షించిన మనకును సామ్రాజ్యము నకును హాని కలుగును. ఈ ద్రోహి నింతట బరిమార్చు టత్యవసరమని తోచుచున్నది. ఏ యుపాయముననైన నితని గడతేర్చుట మేలు.

తిమ్మ:— అట్లే చేయవచ్చును. గాని మునుముందు బాలరా జున కీ సంగతులన్నియు నచ్చజెప్పి, మందలించి, హిత మును బోధించి చూచెదను. అత డాలకింపకున్న కావల సిన కార్యమును గూర్చి యోచించవచ్చును.

నరస:— మన సుభాషితములు బాలరాజునకు వెగటుగ దోచు నేమో! అయినను చెప్పిచూడుడు.

అని చెప్పి నరసరాయడు లేచివెళ్ళెను. తిమ్మరుసు బాలరాజు సన్నిధికేగి, కూర్చొని, రాజకీయములగు వివిధ విషయములను ముచ్చటించి, పిమ్మట "రాజోత్తమా! ఈ సామ్రాజ్యమునకై మీజనకుడును, నరసరాయడును మిక్కిలి శ్రమపడిరి. సేనాధ్యక్షుడైన నరసరాయడు అధికభక్తి విశ్వాసములతో మీతండ్రిగారికి కుడిభుజముగా నుండి ఈసామ్రాజ్యమును విస్తరింపజేసెను. విరోధి వర్గమును నుసుమాడి యతడు మేటి యనిపించుకొనెను. మీఅన్నను పట్టాభిషిక్తుని గావించి మీ తండ్రిగారి యాజ్ఞాను సారము సమస్త రాజ్య భారమును వహించి, నరసరాయడు ప్రజాపాలనము చేయుచుండుట తమకు విదితమేగదా! ఇట్లుండ నరసరాయనిపై విరోధియగు నొక దళవాయి నీసోదరుని జంపించి ఆయపనింద నరసరాయనిపై వేసెను. నరసరాయడు సత్యముగ రాజద్రోహి కాడుగనుక నీకుపట్టము గట్టించి నీచేత పరిపాలనము జేయించుచున్నాడు. ఇప్పుడు అనీచుడగు దళవాయి నీకు హితుడైనట్లు గనుపించుచున్నది. అతడు నీతో చెలిమి జేయుచు నాకును నరసరాయనికిని కీడుదలపెట్టు చున్నాడు. నీవు లోకానుభవము లేని బాలుడవు. భ్రాతృహంతకుడైన దుష్టునితో చెలిమి జేయరానిది. నీచులను దరికి జేర్చుమక్కువ జూపితివేని సామ్రాజ్యమును ప్రాణములును గూడ గోలుపోపలసివచ్చును' "వియ్యమునకు, నెయ్యమునకు, కయ్యమునకు సమత్వమువలయును" అని గదా భారతవాక్యము. కాబట్టి నామనవి ఆలకించి ఆ దళవాయిని బంధించి

యుంచుటో లేక దేశమునుండి వెడలగొట్టుటయో చేయుట నీకు క్షేమము. నీ శ్రేయోభిలాషిని గనుక యింతపూరము చెప్పవలసి వచ్చినది" అని చెప్పి హితోపదేశము జేసెను.

బాలరాజు మాటలను వినియు విననట్లూరకుండెను. గాని సరియైన సమాధానము చెప్పలేదు. తిమ్మరుసు సంతట అతనితో భాషించు టుచితము గాదని యెంచి సెలవుగైకొని లేచివచ్చెను.

తనకు దెలియనప్పు డితరులు చెప్పిననైన వినవలెను. బాలరాజున కనుభవము లేకపోవుటవలన తిమ్మరుసు యొక్కయు నరసరాయునియొక్కయు శక్తిసామర్థ్యములు బోధపడలేదేమో! ఇమ్మడి నరసింహరాయ డావిధముగ తన మాటలను పెడచెవిని బెట్టి నిర్లక్ష్యముగా నుండుటవలన తిమ్మరుసున కాగ్రహ ముదయించినది. బాలరాజునకు తగిన నీతిపాఠము గరపవలెనని అతడు నిశ్చయించుకొని కార్యావసరమున తానును నరసరాయుడును పెనుగొండకు వెళ్ళవలసి వచ్చినదని నరసరాయనిచేత బాలరాజునకు వార్త నంపించి, నరసరాయనితో కలిసి ఆనాటి సాయంకాలమే పెనుగొండకు బయలుదేరి వెళ్ళెను. పెనుగొండలో కొన్ని దినము లుండి అధికసైన్యమును గూర్చుకొని రహస్యముగా దండు వెడలివచ్చి నగరమును ముట్టడించి "భ్రాతృహంతకుడైన ఆదళవాయిని శిక్షింతువా, లేక రాజ్యమునువిడిచి పోయెదవా?" అని బాలరాజునకు కబురు పంపెను. నరసరాయ డిట్లు తిమ్మరుసుతోవచ్చి నగరమును ముట్టడించి కయ్యము

నకు సిద్ధపడు చెరింగి బాలరాజు భయపడి వెంటనే ఆదళ వాయిని జంపించి వానిశిరమును నరసరాయనికడకు బంపెను. నరసరాయ డప్పుడు సంతసించి ముట్టడిమాని అంతఃపురము నకుబోయి బాలరాజునుజూచి "ఇంకెన్నడు నిట్టిపనులను జేయకుము. మహామంత్రి యాలోచన నంతసుఖవుగా పెడ చెవినిబెట్టుట క్షేమముగాదు" అని మందలించి, వెంటనే బాలరాజు నచ్చట నుంచక సంరక్షణార్థము మఱికొంత సైన్యము నొసంగి మఱియొక దుర్గమునకు బంపి కొంతకాల మచ్చటనే యుండుమని చెప్పెను.

౭

బాలరాజును మఱియొక దుర్గమునకు బంపి, తుళువ నరసరాయడే సర్వాధికారము వహించి తిమ్మరుసు సహాయమున కట్టుదిట్టములతో పరిపాలన సాగించుచున్నాడు. ఇప్పుడు నరసరాయడే సార్వభౌము డగుటవలన ఒకవిధముగ తుళువ వంశమే పరిపాలనాధికారమును బొందినదని చెప్పవచ్చును. నరసరాయని యధికారమును సుస్థిరము జేయుటకు తిమ్మరుసు దీర్ఘాలోచన జేసి, ఏముప్పును వాటిల్లకుండునట్లు సాళ్వ వంశాభిమానులగు వారినందరిని రాజ్యమునుండి తరిమి వేయించెను. నరసరాయని యాజ్ఞ రాజ్యమందంతటను నమోఘముగ నిర్వర్తిల్లు చుండెను. మండలేశ్వరులు, మంత్రులు, సేనాపతులు అతని కనుసన్నల మెలగుచుండిరి. తిమ్మరుసుమంత్రి సామ్రాజ్యమున కంతకును మూలస్తంభమయ్యెను.

నరసరాయ డిప్పుడు నిర్విచారముగ భారమంతయు మహామంత్రి వశముచేసి సార్వభౌముడై సుఖించుచుండెను. తిమ్మరుసునకు విశ్రాంతి యేది ? అందరివలె నతడు సుఖముల గోరుటలేదు. చేయవలసిన కార్యమెంతయో ముందు

న్నది. గంగనామాత్యునకు దానుచేసిన వాగ్దత్తము నెట్లు మఱువగలడు? సాహసించి చేయవలసిన పను లెన్నియో యతనికి గలవు. అత డేకాంతముగ నున్నప్పుడెల్ల నతని కీ యాలోచనలే—"తురుష్కులను జయించుట కిదియొక చక్కని మార్గము. వారిలో వారికి కలహములను గల్పించి ఐకమత్యము లేకుండ చేయుటకు పన్నిన పన్నుగడ లిప్పుడు ఫలవంతమైనవి. ఒకరిని చేరదీసి మరియొకరి - నూరద్రోల వలెను. ఇది రాజనీతి. బిజాపురసుల్తాను అగు ఆదిల్‌షా యును కాశింబరీదును ఒండొరుల ద్వేషించుకొనుచుండిరి. తన పగ సాధించుకొనుట కిప్పుడు కాశింబరీదు మన సహాయ మపేక్షించినాడు ఇది మంచిసమయము—"అని తిమ్మరుసను కొనుచుండ, నరసరాయ డిందులకో రావలసినదని వార్త బంపెను అంతట నా యాలోచనల కంతరాయము గలుగ తిమ్మరుసు బయలుదేరి వెళ్ళి నరసరాయని సమీపించెను. నరసరాయనికి తిమ్మరుసునెడ యధిక గౌరవముగదా! అతని బుద్ధిబలమునకు గంగనామాత్యుడు గూడ జాలడనియే నరస రాయని నమ్మకము. తిమ్మరుసును గూర్చుండ నియోగించి నరసరాయడు "తిమ్మరుసూ! తిరుచునాపల్లిని పాలించుచున్న కోనేరినాధుని దుండగములు వింటివిగదా!" అనెను.

తిమ్మ:— ఇప్పుడు క్రొత్తసంగతు లేమైన దెలిసినవా?

నర:— అతడు మత విషయములందు జోక్యము కల్పించుకొని ప్రజలను బాధించుచున్నట్లు తెలియుచున్నది.

తిమ్మ:— అతడు శైవుడు.

నర:— జంబుకేశ్వరాలయము నెడ పక్షపాతము వహించి శ్రీరంగమునందలి రంగనాథుని యాలయ ధర్మకర్తలను మఱికొందఱు భక్తులను పలువిధముల హింసించుచుండ యితని బాధ పడలేక కొందఱు ప్రాణత్యాగము చేసుకొనిరట!

తిమ్మ:— పాపము! ఎవరేమతము నవలంబించిన తనకేమి? ప్రజల నిట్లు బాధించు దుర్మార్గుని మనము పేక్షింపరాదు.

నర:—మన మిప్పుడేమి చేయవలెను?

తిమ్మ:— మనకిప్పుడు కార్యభారము మిక్కుటమైనది. ఉపాయమాలోచించి నేర్పుతో శత్రువుల నెదుర్కొనవలెను. బిజాపుర సుల్తానగు ఆదిల్‌షా శత్రువగు కాశింబరీదు తన విరోధిని జయించుటకు మన సహాయమును గోరుచున్నాడుగదా! కాశింబరీదునకు మనము తోడ్పడుట మనకేమేలు. మన మిప్పుడు కాశింబరీదునకు కొంత సైన్య సహాయము చేయుదము.

నర:— ఈవిషయము మన మిదివరకే నిశ్చయించుకొంటిమి గద! కాశింబరీదునకు మనసైన్యములు రాగలవని వర్తమాన మంపి, పరాక్రమ వంతులును, చతురులును నగు సేనాపతులతో కొందఱు యోధులను, సైనికులను బంపుము. వారు కడునేర్పుతో ప్రవర్తించి, కృష్ణా తుంగభద్రల నడుమనున్న దేశము, ముదిగల్లు, రాచూరు దుర్గముల నాక్రమించుకొనునట్లును, ఎప్పటి సమాచార

మప్పుడు మనకు తెలియజేయుచుండునట్లు వారి కాజ్ఞల నిమ్ము.

తిమ్మ:— చిత్తము. కాశింబరీదున కిప్పుడే యీ సమాచార మంద జేయగలను. వెనువెంటనే సర్వముసిద్ధము చేయించ గలను.

నర:— మఱి కోనేరినాథుని పని పట్టించవలదా ?

తిమ్మ:— తగిన సన్నాహముతోను పదాతిసైన్యముతోను తిరుచనాపల్లి మండలమునకు నేనేగి విజయమును సాధించెదను.

నర:— అట్లువలదు తిమ్మరుసూ ! నీవిక్కడి వ్యవహారములను సమర్థించుచు, ఇక్కడేయుండి కార్యకలాపమును సాగించు చుండుము. నగరరక్షణము నీయధీనము. తిరుచనాపల్లి మండలమునకు తగిన బలముతో నేనే దండు వెడలెదను. కోనేరినాథు నవలీల జయించి శ్రీరంగంబునకు బోయి రంగనాథుని సందర్శించి రాగలను. నాకీదండయాత్ర ఉత్సాహము నినుమడింప జేయుచున్నది.

తిమ్మ:— అటులనా ! శుభమగుగాక! దిగ్విజయము ప్రాప్తించ గలదు. అతిజాగరూకులై మెలంగవలెను. నాగమనాయ కుని మఱికొందఱు యోధులను మీవెంట బంపుదును.

నర:— కుమార నరసరాయనిగూడ నావెంట గొంపోవుదును. కోనేరినాథుడు కయ్యమున కియ్యకొనక, వశుడై, మన అనుజ్ఞలకు లోబడునేమోనని నా నమ్మకము.

తిమ్మ:— అతడు దూరాలోచనలేని క్రూరుడు. వివేకము లేని దుర్మార్గుడు. అందువలన సరసోక్తుల నతడు మంచి మార్గమునకు రాడు. మనము కాఠిన్యమే బూనవలసి వచ్చును.

నర:— కానిమ్ము! అందుకును మనము సిద్ధమేగద! మేము మఱలి వచ్చువరకు భద్రము—మా ప్రయాణమున వలయు సౌకర్యముల నేర్పాటు గావించి సర్వము సిద్ధమగు నటుల తత్సంబంధీకుల కాజ్ఞలను బంపుము.

అని చెప్పి నరసరాయుడు లేచి వెళ్ళెను. తిమ్మరుసప్పుడు సేవకులను రప్పించి సేనానులను రప్పించి, వారెల్లరును మెలంగ వలసిన తీరులను అరుగవలసిన విధానములను, వెంట గొని పోవలసిన పరికరమును మున్నగు విషయములను జెప్పి, సిద్ధపరచి సాగనంపెను. ముఖ్యముగా కాశింబరీమునకు బంపు సైనికులకు, సేనాధిపతులకును అవసరమగు హెచ్చరికలు జేసి చక్కని కట్టుదిట్టములతోనుండి కార్యము సాధించుటకు దగిన ఉపాయములను జెప్పి ధైర్యసాహసముల పురిగొల్పి పంపెను.

బిజాపురరాజ్యమునకును విజయనగర సామ్రాజ్యమునకును మధ్య రాచూరు మండలము గలదు. కృష్ణాతుంగభద్రానదుల నీభూభాగము బలభూయిష్ఠమైన రాచూరుముదిగల్లు దుర్గములచే నలరారుచుండెను. సామ్రాజ్య సంరక్షణ ప్రదేశము కవచమువలెనుండినందున దీని నెప్పుడును తన స్వాధీనములో నుంచుకొనవలెనని బహామనీ సుల్తాను ప్రయత్నించుచుండెను. తనవశము గావించుకొనవలెనని విజయనగర సామ్రాజ్య సార్వభౌముని సంకల్పము. ఇంతటి

ప్రముఖమైన భూభాగమును నిప్పుడు లోబఱచుకొని ఆక్ర మించుటకు మహామంత్రి తిమ్మరుసు తగిన ఉపాయముల నన్వేషించి మార్గమేర్పఱుపగలిగెను. ఆయువుపట్టులగు నీ ప్రదేశముల నాక్రమించుకొనిన, నిక శత్రురాజ్యముల నవ లీల చే జిక్కించుకొనవచ్చును. రాజ్యతంత్ర నిపుణుడైన మంత్రిపుంగవుడు శత్రువులు బలహీనులగుటకు వారి రాజ్య మున నన్యోన్యమైత్రి లేకుండ కలహముల నేర్పరచుటకు తన బుద్ధి బలమంతయు నుపయోగించుచుండెను.

## ౧౦

తలచినపనులుతలచిన ట్లెంతటివానికినిజరుగవు. అంత మాత్రమున కార్యశూరులు నిరుత్సాహపరులుగారు. సాధన మున పనులు సమకూరు ననియే వారి విశ్వాసము. రాచూరు ముదిగల్లు దుర్గముల నాక్రమించుటకు తగిన బల ముతో సైన్యము దండు వెడలినది. దక్షిణదేశమునకు దండ యాత్ర సాగింపదలచిన నరసరాయుని ప్రయాణ మాగిపోయి నది. నిశ్చయించుకొనిన రెండు కార్యములలో నొకటి మాత్రమే జరిగినది. శకునలోపము కొంత జరుగుటవలన నరసరాయుడు తాత్కాలికముగ తన ప్రయాణ మాపు కొనెను. గాని త్వరలో మరల సాగిపోవుటకు నిశ్చయించు కొనెను. కొంతకాలము జరిగినది.

ఉదయము - సూర్యోదయానంతరము రాజోచిత వేషము ధరించి, అలంకారుడై నరసరాయుడు కొలువు కూటమునకు బయలుదేరెను. సేవకులు ముందువెనుకల నడచుచుండ మార్గమధ్యమున నుచిత గౌరవ మర్యాదల నందుచు నతడు మందగమనమున బ్రవేశించి సింహాసనా సీనుడై నలుదిక్కుల గలయజూచెను. ఆదినమున సార్వభౌ

ముదు సభ కేతెంచునని ముందుగ ప్రకటింపబడుటచే కార్యావసరులగు పౌరులు వచ్చి వేచియుండిరి. ఆస్థానమందలి అధికారులు, చిన్న ఉద్యోగులు భయభక్తులతో వారి వారి స్థానముల నుండిరి. తిమ్మరుసప్పటివరకు రానందున రాజాజ్ఞ ననుసరించి అధికారి యొకడేగి తిమ్మరుసును వెంట గొని వచ్చెను. ప్రొక్కుబడులు, పండితాశీస్సులు వేదపఠనము మున్నగు లాంఛనము లన్నియు సక్రమముగ జరిగిన పిమ్మట కొంతకాలము వినోదముల కవకాశ మీయబడెను. అనంతరము విచారణలు ప్రారంభింపబడినవి. ఒకరి వెనుక నొకరుగ పౌరు లరుదెంచి వారి వారి కష్టసుఖములను మనవి చేసుకొనిరి. మహామంత్రి వారందరికి సరసమైన సమాధానముల నిచ్చుచు కావలసిన సౌకర్యముల గల్పించుచు సాగనంపుచుండెను. ఇంతలో మంచిముత్యములను పగడములను గొని వర్తకు లేతెంచిరి. నరసరాయునికి ముత్యములన్న ప్రీతి. వెంటనే ఆస్థానమందలి రత్నపరీక్షకులను రప్పించి విలువగట్టమనిరి. అవి నిజముగ జాతిముత్యము లగుటవలన సార్వభౌముని నాకర్షింపగలిగినవి. ఆ పగడములను ముత్యములను గైకొని విలువగట్టి బొక్కసమునుండి ధనమిప్పించి వర్తకులను బంపివేసిరి. రాచకార్య నిర్వహణానంతరము చిత్రకారుల పనితనమును జూచుట కాహ్వానింపబడి సార్వభౌముడు మహామంత్రితో చిత్రశాల కేగెను.

కొన్నిదినములు గతించినవి. ఒకనాటి సాయంసమయమున తిమ్మరుసు ఆస్థానమందలిఅధికారులతోసంభాషించుచు

కూర్చొని, ఉద్యోగుల ప్రవర్తనమును పరిశీలించుచుండెను. ఇంతలో నొక యుద్ధభటు డతివేగముగ వచ్చి మ్రొక్కి విధేయుడై నిలబడెను. వానినిజూచి తిమ్మరసు "ఏమి సమాచారము? అంతయు భద్రమా? మనసైన్యములు దుర్గములను ముట్టడించినవా?" అని ప్రశ్నించెను.

భటుడు:— చిత్తము. శ్రమ లేకుండ మనసేనాపతులు రాచూరు ముదిగల్లు దుర్గముల నాక్రమించి స్వాధీన పరచుకొని జయభేరి మ్రోగించిరి.

తిమ్మ:— శత్రువు లెదుర్కొనలేదా?

భటు:— ఎదిరినిలిచి పోరాడవలెనని శత్రువులు ప్రయత్నించిరి. గాని మనబలమును జూచినపిమ్మట వారు సాహసించలేక వెనుకంజవేసిరి. ఆదిల్ షాహా యేమియు జేయజాలక యున్నాడుండెను.

తిమ్మ:— మంచిది. నీవుపొమ్ము.

అని వానినిబంపి, అంతరంగికోద్యోగి నొకని రావించి తిమ్మరసు...."నీవిప్పుడే బయలుదేరి రాచూరు ముదిగల్లు దుర్గప్రాంతములకేగి, మనసేనాపతులను గలుసుకొని, వారి స్థితిగతులను విచారించి తెలుసుకొనుము. వారికింకను కావలసిన యేర్పాటులు, పరికరములు వివరముగ గ్రహించి తెలుసుకొనుము. ఆక్రమిత దుర్గరక్షణాలకు వలయు సాధనముల నాలోచించి మా ఆజ్ఞయగువరకు సేనానులను తగిన బలముతో నచ్చటనే యుండవలసినదని చెప్పి వెంటనే

బయలు దేరి రమ్ము. జాగ్రత! వెళ్ళిరమ్ము!" అని అతనిని బంపివేసెను.

సార్వభౌమునకు సంతోషవార్త నెఱిగింపవలెను. ఆస్థానమందలి అధికారులును, నగరమందలి ప్రజలును ఈవిజయవార్తనప్పుడే గ్రహించ గలిగిరి. అందరు పరమానంద భరితులై ఆంధ్రుల బల పరాక్రమములను గూర్చి ముచ్చటించుకొనుచు ఒకరి నొకరు మెచ్చుకొనుచుండిరి. తిమ్మరుసు నరసరాయుని యొద్దకేగి "ప్రభూ! మనకు జయములభించినది. రాచూరు ముదిగల్లు దుర్గములు మనచే జిక్కినవి" అనెను.

నర:— నేడెంత సుదినము. చక్కని శుభవార్త వినగలిగితిమి. మన సేనాపతుల ధైర్యసాహసములు మెచ్చదగినవి. వారి నుచితరీతిని బహూకరించ వలెనుసుమా!

తిమ్మ:— చిత్తము.

నర:— వైరిపీరు లెదుర్కొని యుద్ధము సాగించిరా! మన బలమునకు నష్టమువాటిల్ల లేదుగదా!

తిమ్మ:— వైరులు సాహసించి రణరంగమున నిలువలేక పోయిరట. అధిక సంఖ్యాకులును బలవంతులును నగు మన సైనికులనుజూచి వారు వెనుకంజ వేసిరట.

నర:— లేకున్న వారిచే నేమగును? మనల నెదిరించి నిలుచుటకు వారితరమా? ఆదిల్ షాహా అడిలిపోయి యుండనోపు! మంత్రీ! ఆ దుర్గములను రక్షించు కొనుటకు మనము గట్టి ప్రయత్నముతో నమ్మకముగల సేనాపతుల నుంచవలెను. ఆదిల్ షాహానొకకంటకని పెట్టియుండవలెను

తిమ్మ:— చిత్తము. ప్రస్తుతము నేనాపని యందేయున్నాను.

నర:— ఈ శుభవార్త వినుటకే నేను నిరీక్షించి యుంటిని. ఇక నేను దక్షిణ దేశయాత్ర సాగించెదను. ఈ దినమే ప్రయాణమని నిర్ణయింప బడినదిగదా?

తిమ్మ:— ఔను ప్రభూ!

నర:— సమర్థుడవుగదాయని రాజ్యమును నీవశము జేసి నేను బయలు దేరుచున్నాను. మేము మరలివచ్చువరకు రాజ్యమును భద్రముగ కాపాడి రక్షింపుము. మనమిప్పుడు జయించిన ఆరెండు దుర్గముల రక్షణకు తగిన బల పరాక్రమ సంపన్నుల నచటనుంచుము. గూఢచారుల నందందు నియోగించు టత్యావసరము.

అని చెప్పెను. తిమ్మరుసు శ్రద్ధతో నాలకించి, 'చిత్త' మని సెలవు దీసుకొని లేచివెళ్లెను.

అనుకొన్న ప్రకార మాదినమే నరసరాయుడు తగిన సన్నాహముతో దండయాత్రకు సాగిపోయెను. తిమ్మరుసు మొదలగు ముఖ్యులు వెనువెంట కొంతదూరమేగి నరసరాయుని సాగనంపివచ్చిరి.

తిమ్మరుసు మెలకువతోను, విశ్వాసముతోను ప్రవర్తించుచుండెను. నానాటి కతని కార్యభారము మిక్కుట మగుచున్నది. రాజ్యమును రాజకుటుంబమును కాపాడి సంరక్షించవలసిన బాధ్యత యతనికి గలిగినది. రాజ్యములో మహారాజు మొదలు సేవకునివరకు, అంతఃపురమున పట్టపుదేవి మొదలు పరిచారికవరకు తిమ్మరుసు మంత్రియన్న

భయమే. ఒకభయమేగాదు భక్తిగూడను. రాజ్యమందున్నట్లే అంతఃపురమందును అతని యాజ్ఞమీరుట కెవరును సాహసించలేరు. అతనికి తెలియకుండ నే చిన్నపనియు జరుగదు. రాజ్యరక్షణముకంటె రాజకుటుంబరక్షణము కష్టతరముగదా! నరసరాయనికి అప్పాంబ, నాగాంబ, ఓమాంబ యనుముగ్గురు భార్యలుండిరి. అప్పాంబయందు వీరనరసింహదేవరాయలును, నాగాంబయందు కృష్ణదేవరాయలును, ఓమాంబయందు అచ్యుతదేవరాయలు రంగరాయలు నను నలుగురు పుత్రులు నరసరాయనికి గలిగిరి. ముగ్గురు భార్యలు గల దశరథుడెంత సంకటపడెనో యట్లే నరసరాయుడును బాధపడుచుండెను. సతులయందు గలుగు ప్రణయ కలహముల మూలమున సంభవించు కష్టములను నివర్తింపజేయుటకు నరసరాయనికి తిమ్మరుసే దిక్కయ్యెను. పరిస్థితు లిట్లుండుటం బట్టి రాజ్యకుటుంబ రక్షణ భారము బ్రాహ్మణ మంత్రిపై నుంచవలసి వచ్చినది. బాధ్యతగల యింతటి కార్యనిర్వాహకత్వమున తిమ్మరుసునుగాక, మఱియొకని నెవ్వరినైన నియోగించియున్నచో నరసరాయడు రాజ్యమునే పోగొట్టుకొనియుండెడివాడు. తిమ్మరుసు తన ప్రజ్ఞావిశేషములచేత రాణివాసమున కిష్టనష్టము లేవియు రాకుండ గాపాడుచుండెను. రాజ్యమందును, రాణివాసమందును నున్న అందరి స్వభావములు గుణగణములు చక్కగా గ్రహించినవాడు తిమ్మరుసు. రాజబంధువుల ప్రవర్తన మెట్టిదో సామంతరాజుల నడవడిక లెట్టివో తెలిసినవాడు తిమ్మరుసు. ప్రాంతములన్న

మహామంత్రి చేయు కార్యములకు సార్వభౌము డెన్నడు నడ్డము రాడని ప్రతివారికి దెలియును. అంతఃపురములో నంత గూఢముగా నేపని జరిగినను తిమ్మరుసునకు దెలియగలను.

తిమ్మరుసునకు విరోధులుగూడ లేకపోలేదు. వారు స్వల్ప సంఖ్యాకులు. వారు తిమ్మరుసు నెదుట సాహసించి నిలువలేక భయపడి తమ్ము దామె లోలో రక్షించుకొనుచుండిరి.

అసమానమైన ప్రజ్ఞయు, అత్యద్భుత మేధాశక్తియు అకళంకమైన దేశభక్తియు, వీటన్నిటిని మించిన యౌదార్యమును శాంతమును, బ్రహ్మతేజస్సును గలిగి రాణించుచున్న మహామంత్రి యగు తిమ్మరుసు నెవరు ధిక్కరించగలరు ?

నరసరాయలు దక్షిణదేశ దండయాత్ర కేగియుండుటయు, తిమ్మరుసు నగర రక్షణభారము వహించి యచ్చటనే యుండవలసి వచ్చుటయు గ్రహించి, ఆదిల్ షాహా అధిక సైన్యముతో వచ్చి రాయూరు ముదిగల్లు దుర్గములను ముట్టడించెను. తిమ్మరుసున కీవార్త తెలియగనే అతడు నరసరాయని సోదరుడగు తిమ్మనాయకునికి కొంత సేననిచ్చి ఆదిల్ షాహా నెదుర్కొనుటకు బంపెను.

అతడు తుంగభద్రను దాటి శూరుడై తురుష్క సైన్యము నెదిరించి కొంతవరకు పోరాడగలిగెను గాని శత్రు సైన్యములు వెనుకనుండి తండోపతండములుగ వచ్చి పడుచుండుటవలన నిక ప్రయోజన ముండదని యెంచి తిమ్మనాయకుడు తన బలమును మరలించుకొని రాజధానికి వచ్చి చేరెను.

౧౧

"రాయచూరు ముదిగల్లు దుర్గములు పోయిన పోనిమ్ము. అందులకు విచారించుట బుద్ధిమంతుని లక్షణముగాదు. సార్వభౌము డిచ్చుట లేకపోవుట-నేనిచ్చుటనే నిలువ వలసివచ్చుట- ఆసంఘటనకు ముఖ్యకారణములు. కానిమ్ము. రాజ్యాంగములు బలపరచుకొని తగినపుష్టి సమకూర్చుకొనిగాని తురుష్కులను జయింపలేము. బొక్కసమున ధనము నింపవలెను. ఇంకను అశ్వబలమును, గజబలమును, పెంపొందించవలెను. నగరరక్షక సైన్యము నభివృద్ధిచేయవలెను....ముందు చేయవలసిన పనులివి....ప్రప్రథమమున నగరమున కుత్తరపుదిక్కున శిథిలములైయున్న ప్రాకారములను, దుర్గములను గట్టి చేయవలెను. ఎన్ని దినములు ముట్టడించినను శత్రువుల కభేద్యమై యుండునట్లు చేయవలెను. అంతవరకు నిదురపోరాదు... మఱచితిని... నిన్నటి వార్తలనుబట్టి ఆదిల్ షాహా మనతో మైత్రి గలుపుకొనుట సమ్మతించుచున్నట్లు దోచుచున్నది. అత డట్లరుదెంచెనేని కొంతకాల మతని జేరదీసి యుంచుటయే మేలు. కానిమ్ము! మంచితనమున సాధించవలసిన పనులు గూడ కొన్ని గలవు.—"అని యనుకొనుచు తిమ్మరు

సేకాంతముగ కూర్చొని యుండెను. ఇంతలో నొక యధికారి వచ్చి "పౌరులు కొందరేదియో విన్నవించు కొనుటకువచ్చి వేచియుండి" రని చెప్పెను. అంతట తిమ్మరుసు లేచి వెళ్ళెను.

నరసరాయుడు తిప్పాంబకన్న నాగాంబ నెక్కువ ప్రేమించుచుండెను. అందువలన నాగాంబ మిగిలిన రాణుల కంటె నన్నివిధముల మిన్నగ నుండెడిది. తిప్పాంబ సహజముగ కుటిలస్వభావము కలది. ఆమె కౌటిల్య మప్పుడప్పుడు ఆమె ప్రవర్తనమందు గోచరించుచుండును. నాగాంబ నామె సహింపకుండుటయు, ఆదరముతో మాటాడక ద్వేషించుచుండుటయు, నరసరాయునికి తెలిసిన విషయమే. గాని అతని కేమి జేయుటకును దోచక, సమర్థించుకొను వాకచాకచక్యము లేక మిన్నకుండెను. అప్పుడప్పుడు సందర్భానుసారముగ తిప్పాంబను నరసరాయుడు మందలించు చుండెడివాడు గాని, ప్రయోజన ముండెడిదిగాదు. రాను రాను క్రమ క్రమముగ నాగాంబయందు తిప్పాంబ కసూయ మెండగుచుండెను. వారికి యుక్తాయుక్త విచక్షణ జ్ఞానముండదు గదా! ఈ కారణమున అంతఃపురమునం దప్పుడప్పుడు కొన్ని అవకతవకలు సంభవించుచు చిన్న చిన్న కలత లుద్భవించుచుండెను. ఆ లోటుపాటుల నన్నింటిని నేర్పుతో తిమ్మరుసు సద్దుబాటు చేసి సమర్థించుచుండెడివాడు. ఇపుడొక స్వల్పవిషయమున కీచులాట జరిగి అంతకంత కభివృద్ధి పొందుచుండ తిమ్మరుసు అచట కేగి సదుపాయముగ సమయ జేసి వచ్చెను.

తిమ్మరుసా విధముగ వివిధవిషయముల నన్వేషించి విచారించుచు చక్క జేసికొనివచ్చి సిబ్బందికి సంబంధించిన యధికారిని రావించి రాజ్యమున మతకలహములు, కుల కక్షలు, జాతివైషమ్యములు, కలుగకుండ చూడవలసి యున్నది. ఇది మన కర్తవ్యము- ముఖ్యముగ కర్ణాటకు లును తెలుగువారును క్షీరనీరములవలె కలసి మెలసి యుండ వలయును. కాబట్టి ఆంధ్ర దేశమున కర్ణాటకులకును, కర్ణాట దేశమున తెలుగువారికి నధికారపదవు లొసంగుచుందుము. ఈ యేర్పాటిప్పుడే అమలు పరుపుము" అని ఆజ్ఞాపించి అత నిని బంపివేసి యతడు స్వగృహమున కేగెను.

సాయంసమయము— తిమ్మరు సుద్యానవన మందలి చంద్రశిలామయ వేదికయం దాసీనుడై అందందుగల కుసుమ లతావితానముల నవలోకించి తన్మయుడగుచు వనపాలకు డతి శ్రద్ధతో గారాబమున బెంచుచున్న మాధవీమల్లికాలతల యభివృద్ధినిగాంచి ముదమార నుప్పొంగుచుండెను.

అధికముగను స్వల్పముగను గాక మందముగ మలయ మారుతము వీచుచు మహామంత్రి నానందడోలికల నూగాడ జేయుచుండెను. శృంగార రసాధిదేవత కాలవాలమగు నా యుపవనాంతర స్థిత తటాక మధ్యభాగమునందలి రాజ హంస నొయ్యారము ఇటులుండి మంత్రిపుంగవుని దృష్టిపథ మును మరల్చినది. హంసల నైజగుణ మెంత గొప్పది ? చక్రవర్తులా స్వల్పజీవులను జూచి పఠింపవలసిన దెంతయో గలదు.

ఇట్టి సంతోష సమయమున భటు డొక డతిరయ మున నేగుదెంచి తిమ్మరుసుకు మ్రొక్కి నిలువబడెను.

తిమ్మ:— ఓహో! తిరుచునాపల్లి మండలమునుండి వచ్చినవా డవా! రాజేంద్రుడు భద్రమగా!

భటు:— చిత్తము! కోనేరినాథు నోడించి సార్వభౌముడు విజయ విరాజితుడై సపరివారముగ శ్రీరంగమున కేగెను.

తిమ్మ:— శ్రీరంగనాథుని భక్తియుక్తముగ సందర్శించి మఱిలివచ్చును!

భటు:— చిత్తము. రేపటిదిన మిచ్చటికి చేరగలరు.

తిమ్మ:— మంచిది. నీవు సత్వరము నేగి ఆస్థానమండలి యధి కారి నొకని నిటకు బంపుము పొమ్ము.

భటు డచ్చోటు వీడిపోయి, ఆజ్ఞానుసారము వెంట నే యధికారిని బంపెను. తిమ్మరు సతనినిజూచి "సార్వభౌముడు పరివారయుతముగ నిప్పుడే నగరముప్రవేశించును. కోనేరి నాథుని జయించి విజయులై వచ్చుచున్నవార్త నగరమున బ్రకటన సేయవలెను. నగర మలంకరింపబడి, ఆనందమున ప్రజలెదురేగి స్వాగతమిచ్చు నట్లేర్పాటు జేయుము" అని చెప్పెను. "చిత్తము. అట్లే జరుగగలదు" అని ఆ యధికారి సెలవు దీసుకొని యేగెను. తిమ్మరుసట కొంతకాలమాగి ప్రొద్దు గ్రుంకువేళకు నిజగృహంబున కరిగెను.

మఱుస టుదయమున తిమ్మరుసు పురజనులతోను, మంత్రి సామంత పురోహితులతోను మంగళవాద్యములు చెలరేగ బయలుదేరి సమీపముననున్న గ్రామమువర కేదు

రేగి సార్వభౌముని సగౌరవముగ వెంటకొనివచ్చెను-
ప్రయాణ బడలికచే నరసరాయ డాపూట నేమియు ముచ్చ
టించక విశ్రాంతి గైకొని సూర్యాస్తమయ మగుసరికి
ప్రశాంతముగా గూర్చొని తిమ్మరుసును రావించి ముచ్చ
టించుటకు ప్రారంభించెను. రాజకీయములు, నగరమందలి
మంచిచెడ్డలు, ఆస్థానమందలి బాగోగులు వివరముగ తిమ్మ
రుసు నరసరాయనికి విన్నవించి అటుపిమ్మట, ఆదిల్‌షాహ
రాచూరు ముదిగల్లు దుర్గముల నాక్రమించుకొనిన విధాన
మును అప్పుడు సంభవించిన అసందర్భములును చెప్పి,
ఆదిల్‌షాహ మన నెయ్యమును గోరుచున్నాడనియు, అతడా
విధముగ దిగివచ్చుట మన కొకవిధముగ లాభకరమే ననియు
విపులముగ నచ్చజెప్పెను. సార్వభౌము డంతయు శాంతముగ
నాలకించి ముదిగల్లు రాచూరు దుర్గములు సుల్తానువశమై
నందులకు విచారపడెను. తదనంతరము నరసరాయడు తన
దండయాత్రను గూర్చిన విశేషములను వివరించుటకు ప్రారం
భించెను. కోనేరినాధు డధిక సైన్యముల గూర్చుకొనివచ్చి
మనల నెదుర్కొని రణము సాగించెననియు, కొంత యుద్ధము
జరిగినపిమ్మట కోనేరినాధు వోడిపోయి సంహరింపబడుటయు,
అనంతర మా ప్రదేశముల నాక్రమించుకొన్న తెరంగును
చెప్పెను. తిమ్మరుసు శ్రద్ధగా నాలకించుచు మధ్య మధ్య
సందేహముల నడిగి తెలుసుకొనుచు వినయుడై గూర్చొని
యుండెను. నరసరాయడు తాను శ్రీరంగమును దర్శించు-

టయు నచట కోనేరినాథుని బాధలకు తాళజాలక పాఱి పోయిన వైష్ణవ స్వాముల రప్పించి అభయ మొసగి ఉచిత సౌకర్యముల గల్పించితిననియు చెప్పి జరిగిన వృత్తాంత మెరిగించెను. పెద్దకాల మీవిధముగ వారుభయులును సంభాషించుకొని లేచివెళ్ళిరి.

## ౧౨

నరసరాయడు తన పుత్రులలో పెద్దవాడగు వీరనర సింహరాయనికంటె నాగాంబ కొడుకైన కృష్ణదేవరాయని మిక్కిలి మక్కువగ నాదరించుచుండెను. అతడు కృష్ణదేవ రాయనికి విద్యాబుద్ధులు నేర్పుటకు తిమ్మరుసునే నియోగించెను. తిమ్మరుసధిక సంతోషమున సమ్మతించి కృష్ణదేవ రాయని విద్యాభ్యాసమున తన తమ్ముడు గోవిందరాజు నేర్పాటుజేసి, తానును తీరినపుడెల్ల యాబాలునికి వివిధ విద్యలు నేర్పుచుండెను. కృష్ణదేవరాయ లందచందము లమరిన సుందరాంగుడు. చక్కని ముఖవర్చస్సు గలవాడు. అంత పొడవును పొట్టియుగాక కాయపుష్టికిం దగినటులుండును. సార్వభౌముని కుండవలసిన లక్షణము లనేకము లతని యందు గోచరించుచుండెను. వీరనరసింహరాయలు భుజబల పరాక్రమ సంపన్నుడైనను తల్లివలె క్రూరస్వభావమును క్రూరచిత్తమును గలవాడు.

పరిస్థితులన్నియు గమనించుచుండిన అప్పాంబ కంత కంతకు కృష్ణదేవరాయనిమీదను నాగాంబయందును అసూయాజనితమగు ద్వేష మధికమగుచుండెను. నరసరాయడును

తిమ్మరుసు మంత్రియు గలసి సపత్నీపుత్రుడైన కృష్ణదేవ రాయనికే పట్టము గట్టుదురనియు, తనకుమారుడగు వీరనర సింహరాయని కేమియు నుండదనియు ఆమె నమ్మెను. ఆమె కేమి చేయుటకు దోచలేదు. నరసరాయనితో నీవిషయము ముచ్చటించినను ప్రయోజన ముండదని ఆమె యూహించెను. తుదకామె కొక్కటేమార్గము గనుపించినది. కృష్ణదేవరాయలు బ్రతికియుండగ తనపుత్రునికి రాజ్యము లభించుట కల్లయని యామె నిశ్చయించుకొన్నది. కాబట్టి కృష్ణదేవరాయని జంపించుటకన్న గత్యంతరము లేదని స్థిరపరుచుకొని సాహసమున కొడిగట్టినది. దయాదాక్షిణ్యములు మృగ్యమైనవి. పాపభీతి మొదలంట నశించినది. ధర్మాధర్మవిచక్షణజ్ఞాన మంతరించినది. ఇప్పుడామెకు గావలసిన దొక్కటే—వీరనరసింహరాయలు సింహాసన మధిష్టించవలెను. ఇందుల కవసరమగు ఘోర మెంతయైన నాచరించుట కామె వెనుదీయదు.

తిప్పాంబ కార్యాచరణమునకు గడంగినది. నమ్మకమగు దాసీకన్య నొకదాని నందులకు నియోగించినది. కృష్ణదేవరాయని విషప్రయోగమున నే జంపమని యాజ్ఞాపించినది.

సత్యమెవరు గ్రహించగలరు? నరసరాయడు వీర నరసింహదేవరాయని గాదని కృష్ణదేవరాయునికి రాజ్యమీయదలచెనా, అందులకు తిమ్మరు సన్నుపమునా? వెట్టి యాలోచనలు! తిమ్మరుసునకు కృష్ణదేవరాయలు చుట్టమై వీరనరసింహరాయలు గాకపోయెనా! న్యాయసమ్మతముగ

వీరనరసింహ దేవరాయలకు రావలసిన రాజ్యమున కంత రాయ మెవరు కల్పింతురు? అందువలన గలుగబోవు ప్రయోజనమేమి ? వక్రబుద్ధిగల తిప్పాంబ కింతటి యాలోచనలు జేయుటకు దగిన విశాలహృదయము లేక పోయినది. అన్యాయముగ, అక్రమముగ, అసహజముగ యేపాపమెరుగని పవిత్రహృదయుడగు కృష్ణదేవరాయని ప్రాణముల దీయ సమకట్టినది. సర్వసాక్షియగు భగవంతుని కనులు మూయగలమా ?

ఆవగింజంత అవకాశమిచ్చిన కొండంత ఊహసేయ గల అఖండప్రజ్ఞా ధురంధరుండగు తిమ్మరుసీ రహస్యమును గ్రహించ గలిగెను. తక్షణ మాతడు రెండవకంటి వానికి దెలియకుండ క్రూరకార్యాచరణమునకు సిద్ధపడిన దాసీకన్య తలదీయించి కృష్ణదేవరాయని ప్రాణాపాయమును దప్పించెను. పిమ్మట కృష్ణదేవరాయని రాజమందిరము నందుంచుట శ్రేయస్కరముగాదని యూహించి విద్యనేర్పుట కను నెపమున నతనిని తన యింటి యందుంచుకొని పెంచుచు, చదువు సంధ్యలు నేర్పుచుండెను. కృష్ణదేవరాయలు అప్పాజీ (నాయనగారు) అని తిమ్మరుసును బిలుచుచుండెను.

అప్పటినుండి కృష్ణదేవరాయని కే యపకారమును వాటిల్లకుండ పితృవాత్సల్యమున సంరక్షించుటకై రక్షకుడుగ గోవిందరాయని తిమ్మరుసు నియమించెను. క్రమ క్రమముగ పెద్దవాడగుచు విద్య నభ్యసించుచున్న కృష్ణదేవరాయలు పదునెనిమిది సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి

సంస్కృతాంధ్ర భాషలయందు చక్కని పాండిత్యము నార్జించి కర్ణాటభాషయు, హిందూస్థానీ భాషయు నభ్యసించెను. సాముగరిడీల నేర్చి ధనుర్వేదపారంగతు డయ్యెను. అశ్వారోహణమునం దసమాన ప్రజ్ఞావంతుడై బిరుదములందెను. తిమ్మరుసు అతని చాకచక్యమునకును భక్తికిని మెచ్చుకొని స్వయముగ రాజనీతి, దండనీతి మున్నగు విద్యలు జెప్పెను. కృష్ణరాయ డీవిధముగను, దైవానుగ్రహము వలనను తిమ్మరుసు కృపావిశేషము బట్టియు శరీరబలమును, విద్యాబలమును సంపాదించుకొని వివిధ ధర్మ మర్మములు, నీతులు నేర్చుకొని తిమ్మరుసునకు సంతసె మొందించుచు ప్రజారంజకుడై ప్రవర్తించుచుండెను.

కొంతకాల మట్లు జరుగునంతలో నరసరాయనికి నీరు జూపి శరీరమంతయు వాచినది. ఎన్నిమందులు వాడినను ప్రయోజనములేక తుదకది ప్రాణోపద్రవ కరణముగా బరిణమించెను. తిమ్మరుసు అనేక సీమలనుండి రాజవైద్యులను రావించి ఔషధసేవ చేయించెను. లాభ మిసుమంతయు లేక పోయినది. నరసరాయుని కధైర్యముతోచినది. తానిక జీవించుట దుర్లభమనుకొనెను. అతనికిపుడు మంచి చెడ్డలను గూర్చి చెప్పుటకుగాని, హృదయము విప్పి ముచ్చటించుటకు గాని తిమ్మరుసు తప్ప మఱెవ్వరును లేరు. విశ్వాసముంచ దగిన వ్యక్తి అతని దృష్టిలో ఒక్క తిమ్మరుసే. అతడు తిమ్మరుసును రావించి "అమాత్యశేఖరా! చూచుచుంటిరి గదా నాస్థితిగతులు. నేనిక బ్రతుకుట కల్ల. నాకవసాన

కాలము సమీపించినది. ఇంతవరకీ సామ్రాజ్యమును సముద్ధరింపబడి వన్నెకెక్కుటకును నాయశశ్చంద్రికలుదిగంతములు వ్యాపించుటకును కారణభూతుడవు నీవు. ఇప్పటివరకు నేను పేరునకు మాత్రమేగాని సామ్రాజ్యభారమంతయు నీవేవహించితివి. ఇకముందు గూడ ఇట్లే సామ్రాజ్యము నీవలన సురక్షితము కాగలదని నానమ్మకము. నారాజ్యమును, నాబిడ్డలను నీకప్పగించి ప్రాణములను విడుచుచున్నాను. నావెనుక వీరనరసింహ దేవరాయలను సింహాసన మెక్కించుము. అతడు నీసహాయ సంపత్తితోను, కృష్ణదేవరాయని తోడ్పాటుతోను ప్రజానురంజకముగ రాజ్యము నేలగలడు. లోటుపాటులను సద్దుకొనుచు వాత్సల్యమున వారలను కాపాడుము. నాపుత్రుల లోండొరులకు కలహము లేర్పడకుండ కనిపెట్టి రక్షింపుము. తిమ్మరుసూ! మఱియొక మాట. ఇమ్మడి నరసింగరాయనిచే గాని అతని సంబంధీకుల వలన గాని యుపద్రవము రాకుండా సామ్రాజ్యమును రక్షింపుము.'' అని చెప్పెను.

తిమ్మరుసు సంతయువిని "రాజేంద్రా! తమ యాజ్ఞాను సారముగా జరుపగలను. తమరీవిషయముగూర్చి నిస్సందేహముగను నిర్విచారముగను నుండవచ్చును." అని సమాధానము చెప్పినరసరాయునిసంతసింపజేసెను. అంతట నరసరాయడుపుత్రులనుబిలిపించి "బిడ్డలారా! ఇంతటినుండియుమీకు రక్షకుడు తిమ్మరుసు. మీరతని కనుసన్నల మెలగుచుండవలెను. అఘటనఘటనా చాతుర్యధురీణుడును, రాజ్యరాజ్యాంగ

నీతి వేత్తయునగు నీమంత్రి పుంగవుని కలిమి బలిమిచే మీ సామ్రాజ్య విభవములు రాణించగలవు. కృష్ణకు దిగువ భాగమున నశ్వపతులకు, గజపతులకు స్థానములేకుండ చేయ వలసిన భారము మీయుంచుచున్నాను. ఎంతకాలము రాచూరు ముదిగల్లు దుర్గములు విరోధులవశమై యుండునో అంతకాలము మన సామ్రాజ్యమునకు భద్రములేదని మీరు గ్రహింపవలెను. మహామంత్రియగు తిమ్మరుసుబుద్ధి ననుసరించి ప్రవర్తించితిరేని నిక్కముగ మీకుజయము లభించగలదు. ఈ నాకోర్కెలను కొనసాగింపుడు. ఇవియే మీకు నాకడసారి మాటలు" అని హితోపదేశము గావించెను. వైద్యులతనిని విశేషముగా మాట్లాడ వలదని మందలించిరి. ఆ దిన మట్టులనే గడచిపోయెను. తిమ్మరుసు అచ్చటనే ఆగి రాజేంద్రుని స్థితిగతులను గమనించుచుండెను. అతని కెట్లుండునోయని ప్రతిక్షణమును తహతహలాడుచుండిరి. నిపుణులగు వైద్యులరుదెంచి మంచి మంచి మందులను వాడుచుండిరి గాని మరునాటికి నరసరాయుడు పరలోక గతుడాయెను.

నరసరాయుని మృతి తిమ్మరుసు నాందోళనాయత్త చిత్తుని గావించెను. తీవ్రతర సమస్య లతని యూహాపథమున కష్టదగులుచుండెను. కృష్ణదేవరాయలు రాజగునేమో నను యనుమానమున తిప్పాంబయు నరసింహరాయలును మాత్సర్యమున కుట్రలు చేయుచుండిరి. వీరివలన తనకును కృష్ణదేవరాయలకును ముప్పు వాటిల్లకుండ తిమ్మరుసు కడు జాగ్రతతో మెలంగవలసి వచ్చెను. వీరనరసింహరాయలు తిమ్మరుసునకు వినయవిధేయతలు జూపుచున్నాడు. విశ్వాసపాత్రునిగా నెంచుకొనుటకు వీలులేదు. అట్లని కృష్ణదేవరాయనికే పట్టముగట్టు నాలోచన తిమ్మరుసునకు లేదు. ఇమ్మడి నరసింహరాయనిగూర్చి యాలోచించు టవసరమని యితనికి దోచినది. వీరనరసింహుని వజ్రసింహాసన మెక్కించి ఇమ్మడి నరసింహరాయని గాదని త్రోసిపుచ్చిన సామంతులకు సేనానులకు బ్రజలకు సమ్మతము గాదేమోనని యతడాలోచించుచుండెను. ఇమ్మడి నరసింహరాయుడు పెనుగొండలో నుండెనుగదా!

మఱియు నతనికన్న వీరనరసింహుడు బలవంతుడగుట సింహాసన మాక్రమించి తానే చక్రవర్తినని ప్రకటించెను.

తిమ్మరుసు తనకు సాయపడకున్న తన యాటలు సాగవని యతడు గ్రహించి తనకుతోడు పడవలసినదని తిమ్మరుసును ప్రార్థించెను. సంతోషమున సమ్మతించి తిమ్మరుసతనిని విద్యానగర సామ్రాజ్యమున కభిషిక్తుని జేసెను. అధికార వర్గము తిమ్మరుసన్న భయభక్తులు గలవారుకదా! మంత్రి మాట కెవరును నెదురాడ లేకపోయిరి.

మన నరసింహుడు వజ్రసింహాసన మధిష్ఠించినంత నే, తిమ్మరుసనుమానించినట్లే రాజ్యమున నల్లకల్లోలములు జనించినవి. ఒక్కమాఱుగ సామ్రాజ్యమున నవిధేయత మొలకలెత్తినది. కర్ణాట దేశము నందలి సామంతరాజులు కొందరసమ్మతిని జూపుచు కప్పముల గట్టుటమాని ధిక్కరించిరి.

ఎటుబోయి ఎటువచ్చునో యని తిమ్మరుసు దీర్ఘాలోచనగావించి యతనిని సంతసింపజేసెను. తుంగాభద్రానదీతీరమున కొంత సైన్యమును- గజపతు లాక్రమించకుండ ఉదయగిరిప్రాంతమున కొంతసైన్యమును గాపుంచెను.

రాజధానియగు విద్యానగరమున, మూలబలమునుంచి తన తమ్ముడగు గోవిందరాజును నగర సంరక్షణకు నియోగించెను. నగరమున రాజద్రోహులను తలయెత్తకుండ జేయుచు ప్రముఖుడగు గోవిందరాజన్నివిధముల గాపాడు చుండెను.

"ఇప్పుడే చిక్కు తీరుటెట్లు ? కప్పముల గట్టక ధిక్కరించుచున్న సామంతరాజులను, పాలెగాండ్రను నెట్లు సన్మార్గమునకు ద్రిప్పవలెను ? ఈ యవకతవక లన్నియు సమసి

పోయి రాజ్యమున సుస్థిర శాంతిభద్రత లెట్లు నెలకొల్పబడును? తిమ్మరుసున కివే యాలోచనలు. వీరనరసింహరాయ లీస్థితిని గమనించి తమ్ములగు నచ్యుతరాయలను శ్రీరంగరాయలను, కొంత సైన్యముతో కొంకణ దేశమునకును, కర్ణాటకమందలి ఉమ్మత్తూరు మున్నగు ప్రదేశములకును కప్పములను రాబట్టుటకై పంపెను. వారటు లేగి కొంతవరకు పోరాడి తుదకు సమర్థించుకొను శక్తిచాలక మరలివచ్చిరి. అప్పుడు వీరనరసింహరాయలు తిమ్మరుసును రావించి, "అమాత్యవర్యా! చూచితివిగదా పరిస్థితు లెట్లున్నవో! మా జనకుడు పరలోకగతుడగు సమయమున మమ్ములను, మారాజ్యమును నీకప్పగించి రక్షించు భారము నీయందుంచెను. నీవు మాకు విశ్వాసపాత్రుడవు. నీక్రమశిక్షణయందు పెరిగిన మాతమ్ముడు కృష్ణరాయడును, నేను, నీకుసమానులమే! కృష్ణరాయడన్న నత్యంతప్రేమ. అందులకు నీ వెంతమాత్రము సందేహింప బనిలేదు. నీవుమహారాజ్యతంత్రజ్ఞుడవు—నీకు నీవే సాటి—ఇప్పుడు మనకు కప్పము కట్టుట మాని అవిధేయులైన పాలెగాండ్ర నేమి చేయవలయునో యోచింపు"మనెను. తిమ్మరుసంతయు విని "రాజేంద్రా? మనకు కప్పములు చెల్లింపక తిరుగబడినవారు కొందరున్నారను వార్త నాలుగుమూలల కెగబ్రాకకముందే వారలనులోగొను ప్రయత్నముల గావించి జయించుట క్షేమము—అదియునుగాక చిన్నపాలెగాండ్రను సైతము అధిక సైన్యముతోబోయి రూపుమాపుట మేలు—మీరుతీర్థయాత్రకని బయలుదేరి కావలసినంత సైన్యమును వెంట

నిడుకొనిపోయి, సామ్రాజ్యమంతటను కలియదిరిగి కప్పముల గొని రావలయును. కప్పముల చెల్లింపక తిరస్కరించిన వారిని పదభ్రష్టులను గావించి వారిస్థానముల క్రొత్తవారిని నియమించి, యనుగ్రహించి కప్పములు గొనవలెను. ఒక వేళ రణమున దిగవలసివచ్చిన యెడల అందులకును సిద్ధపడి శత్రువులను రూపుమాపవలెను. మీరిట్లు చేయుట మేలు. వజ్రసింహాసనమును, రాజ్యమునుసంరక్షించుచు నేను రాజధాని యందుండెదను." అని చెప్పెను.

వీరనరసింహరాయని కావాక్యము లెంతయు నుక్తియుక్తముగ దోచినవి. అతి డానందమున నందులకు సమ్మతించి బయలుదేరుట కాయత్తపడుచుండెను. తిమ్మరుసు వీరనరసింహరాయుని కనసరమగు నేర్పాటులు గావించి మఱి యొక యాలోచనముగూడ జేసెను. కృష్ణదేవరాయలు బలపరాక్రమములుగల వీరుడనియు, మంచి కార్యసాధకుడనియు తిమ్మరుసు విశ్వాసము- అతడు కృష్ణదేవరాయనికి అచ్యుతరాయని తోడుజేసి మఱికొంత సైన్యముతో దక్షిణ కర్ణాటముపై దండయాత్రకు బంపుట మేలని తలచెను.

వీరనరసింహరాయలు మంచి శుభదినమున సైన్యమును గూర్చుకొని, తీర్థయాత్రను బ్రకటించి, బయలుదేరి వెళ్లెను. మరియొక మంచి సమయమున తిమ్మరుసు చెప్పిన ప్రకారము కృష్ణదేవరాయలు, అచ్యుతరాయని కొంత సైన్యమును దీసుకొని కర్ణాటమునకు దాడి వెడలెను.

ప్రజల చిత్తప్రవృత్తులు అతిచిత్రముగ నుండును. ఒకరి కొకరికి సంబంధ ముండదు. మన స్తత్త్వ విచార మెరింగిన మహామహులు అద్దానిని చక్కగ గ్రహింపగలరు. లోకమునం దొక్కొక్కని పోకడ లానంద దాయకములై మనోహరముగ నుండును. ఒకని నడవడి ప్రశాంతమై, గంభీరమై ముచ్చట గొల్పుచుండును. ఇంకొకని ప్రవర్తనము మహానదీ ప్రవాహమువలె ఒడుదుడుకులతో నిండియుండును. ఒకరాజు ప్రజలనుబీడించి, బాధించి రాజ్యమేలును. ఒకరాష్ట్రపతి ప్రజల సేవకుడై ప్రజల యనురాగాతిశయముల నార్జించును. ఒకమంత్రి స్వార్థత్యాగియై, రాజ్యమునకు సేవ జేయుచు తన జీవితము నర్పించును. చక్రవర్తి మొదలు సైనికుని వరకు నెప్పుడో యొకప్పు డందరును అంతరించువారే గాని, నిలుచునవి, వారి చర్యలు - కీర్త్యపకీర్తులు.

ఇప్పుడు తిమ్మరుసున కేమిలోటు? రాజ్య మతని హస్తగతమై యున్నది. సిరిసంపదలతో తులతూగుచున్నాడు. అనుభవించుట కనేక సదుపాయములు, సౌకర్యములు గలవు. అతడేదిచేసిన అడుగువారు లేరు.

కాని అతని కివేమియు నచ్చవు. అతి సులభమైన జీవిత విధాన మతడవలంబించునది. రాజ్యమంతయు సుఖముగనున్న అతడు సుఖించినట్లె-అంతటి స్వార్థత్యాగి, అంతటి పరోకారపారీణుడుఅంతటి ప్రభుకార్య సేవాతత్పరుడు, అంతటి నీతివేత్త, ఆకాలమున మరియొకడు లేడు. అతని కతడే సాటి.

రాజ్యభార మతని యందుంచి వీరనరసింహరాయలు దండయాత్రకు వెళ్ళినప్పటినుండియు తిమ్మరుసు నగరసంరక్షణ కనేక నూతన పద్ధతుల నవలంబించి మరింత కట్టుదిట్టములు జేసెను. అనుదినము బలమధికము జేయుచు, సైనికోద్యోగులకు క్రమశిక్షణ నొసంగు నేర్పాటులు గావించెను. ఇవన్నియు గాక బొక్కసమున మరికొంత ధనమును నిలువచేయుచు, సామ్రాజ్య సంరక్షణల నవసరమును గుర్తించి ఎప్పటి కప్పుడా కార్యముల నాచరణమున బెట్టుచుండెను. నగరరక్షణ కతడెంత శ్రద్ధవహించుచుండెనో అంత శ్రద్ధతో నగరాభివృద్ధికిగూడ పాటుపడుచుండెను. ప్రజారోగ్యకరములగు పనులును, ప్రజలకనువగు సౌఖ్యోపవసతులను అత డనేకములు కల్పించెను. పేదల కత్యవసరమగు ఉచిత వైద్యాలయములెన్నియో నాత డేర్పరిచెను. దేవతాసంబంధములును మతసంబంధములును నగు ధర్మకార్యములను జేయించెను. ఇవి యేల ? సర్వజన సౌభ్రాతృత్వ మున కవసరమగు నన్ని కార్యములను జేయించెననియే జెప్పవచ్చును. ప్రజలు తిమ్మరుసు ననేకవిధముల మెచ్చుకొనిరి. భక్తిశ్రద్ధలును ప్రేమానురాగములును కుదిరి ప్రజలకు తిమ్మరుసునెడ గౌరవాధిక్యత లేర్పడినవి.

తీర్థయాత్ర కేగిన నరసింహరాయని సమాచారమెప్పటికప్పుడు చారులవలన తిమ్మరుసునకు దెలియుచున్నది. అతడు శత్రుజన భయంకరుడై, అమితోత్సాహమున సామ్రాజ్యమందంతటను సంచారము జేయుచు, తిరస్కరించిన పాలె

గాంగ్రడను దొలగించి వారి స్థానముల గ్రొత్తవారిని నియ మించుచు, యెదుర్కొని పోరాడినవారిని సంహారింపుచు దక్షిణ సముద్రమువఱకు బోయెనట. పాండ్య, చోళ దేశముల లోని రాజులు ఎల్లరు వంగి కప్పములను చెల్లించిరట- ఆదిన మే ఈ శుభవార్త తిమ్మరుసునకు దెలిసినది. అతని సంతోష మున కప్పుడు మేరలేదు.

అన్నియు శుభసూచకములే! అన్నియు మంగళ లక్షణములే! అన్నియు సంతతానంద సంధాయకము లగు మేలువార్తలే! దక్షిణ కర్ణాటమునకు దండువెడలిన కృష్ణదేవరాయని సమాచారములు చారులు గొనివచ్చిరి. అతడు యిమ్మత్తూరును ముట్టడించి ఘోరయుద్ధము చేసి శత్రువుల నోడించి దుర్గమును స్వాధీనపరుచు కొనెనట. అనంతరము కర్ణాటముననున్న బలాఢ్యములగు దుర్గములలో నొకటియగు శివసముద్రమును ముట్టడించి, మరికొందరు పాలె గాండ్రను లోబరచుకొని వారిసహాయమున శత్రువుల నెదు ర్కొని శివసముద్రమును స్వాధీన పరచుకొనెనట. తిమ్మరుసీ వార్తవిని ఉప్పొంగి పోయెను. శివసముద్రమును స్వాధీన పరచు కొంటివా! భళి! కృష్ణరాయా! ఏమి స్రీప్రతా పము! నాపేరు దక్కించితివి! ఇప్పటికికదా నాకు తగినవాడవు లభించితివి" అని యతడనుకొనెను.

(కోలాహలము).-నగరమున సంతోషానందములు చెలరేగి కోలాహలము మిన్నుముట్టినది. ఆబాలగోపాలమునకా నాడు పండుగ. ఒక్కరికి విశ్రాంతి లేదు. అందరు అలంకరించువారే! అందరు అందము దిద్దువారే! అందరు సుగంధద్రవ్యముల సేకరించువారే! అందరు పుష్పరచన సేయువారే! నగరము నాట్యక కళాపీఠమైనది. ఆపౌరుల కంతటి నేర్పరితన మెట్టులలవడినదో! నూతనాభరణాలంకార శోభితయై నాథుని జేరబోవు సుశీలవలె, యీ నగరము కృష్ణదేవరాయనికి స్వాగత మిచ్చుటకు సిద్ధపడెను. తీర్థయాత్ర కేగిన వీరనరసింహరాయడు యశోవిరాజితుడై నగరమునకే తెంచుచుండెను.

కర్ణాటమునకు దాడివెడలిన కృష్ణదేవరాయలు కొలది దినములకు పూర్వమే, విజయోత్సాహముతో రాజధాని ప్రవేశించెను. తిమ్మరుసు పరివారసమేతుడై యెదురేగి కృష్ణరాయని దోడ్కొని వచ్చెను. అతడు దక్షిణ కర్ణాటమును జయించి, కర్ణాటదేశమున కంతయు శ్రీరంగపట్టణము నధికార స్థానముగ నియమించి, విజయధ్వజ మెత్తించి, కప్పములగొని మరలి వచ్చెను. కృష్ణరాయని బలపరాక్రమముల నందరు కొనియాడిరి. అతని కీర్తి నలుదిక్కుల కెగబ్రాకినది.

తిమ్మరుసుమంత్రి కృష్ణదేవరాయలు, అధికారులు, ఉన్నతోద్యోగులు, పరివారము మున్నగువా రందరు మేళ తాళములతో బయలుదేరి వీరనరసింహారాయని దోడ్కొని వచ్చుట కెదురేగిరి. ప్రజలు తండోపతండంబులుగ వారి ననుసరించిరి. వీరనరసింహారాయని పుష్పమాలాలంకృతుని గావించి భుజబల వీరనరసింహారాయనికి జై యను జయ ధ్వానములతో నగరమున ప్రవేశపెట్టిరి. ఆదిన మెన్నియో ధర్మములు చేయబడినవి. ఎన్నియో సమారాధనలు జరుప బడినవి.

వీరనరసింహారాయని తీర్థయాత్ర ప్రశంసింపదగినది. అతడు కంచి, పక్షితీర్థము, జంబుకేశ్వరము, శ్రీరంగము, మధుర, గోకర్ణము, కాళహస్తి, శ్రీశైలము, వెంకటాచలము మున్నగున వెన్నియో పుణ్యక్షేత్రముల సేవించి, అనేక భూదానముల, గోదానముల, సువర్ణదానముల నొసంగి పేరు గాంచెను. శత్రువుల నందరను జయించి కప్పముల గొనెను. ఈ దండయాత్రలో వీరనరసింహారాయు నెదరించి నిలచి పోరాడిన వారిలో నొక్కడును తప్పించుకొనిపోయి యుండలేదు. పాండ్య, చోళ దేశమందలి నృపతులతనికి వశులై స్నేహము జేసుకొనిరి. అతడు సామ్రాజ్యమంతయు కలయదిరిగి తన యధికారము సుస్థిరముగ నెలకొల్పి, బిరుదులంగొని రాజధాని కరుదెంచెను.

తండ్రియాజ్ఞానుసారము వీరనరసింహారాయలు మహామంత్రికి విధేయుడై అతని చెప్పుచేతల మెలంగుచు చక్రవర్తి

యై రాజ్యపాలనమున రాణించెను. తిమ్మరుసు సతనిని హృదయ పూర్వకముగ నాశీర్వదించెను. అతనిని యశస్సంపన్నుని జేయుట కెంతయో ప్రయత్నించెను. అతని కన్నివిధముల తనసహకారమును జూపుచు, సముచిత ప్రవర్తన మతని కలవడ జేసి, శక్తిసామర్థ్యములుగల చక్రవర్తియని, యని పించెను. అతనిని పుణ్యకార్యోన్ముఖుని గావించి, దేవాలయ ములు, తటాకములు, గురుకులవాసములు మున్నగు వాటిని నిర్మింపజేసెను. తిమ్మరు సట్లు చేదోడువాదోడుగ నుండ వీర నరసింహరాయ లవక్రపరాక్రమశాలియై శత్రువుల నుక్కు డంచి సామ్రాజ్యము నేలుచు "మహారాజాధిరాజ, రాజపర మేశ్వరుడు, మూరురాయగండడు, పరరాజభయంకరుడు, హిందూరాయ సురత్రాణుడు" మున్నగు ప్రసిద్ధ బిరుదముల నందెను. ఇతడు తానార్జించిన దేశములను, చక్క జేసికొనిన సామ్రాజ్యమును స్థిరపరచుకొనుటకే సరిపోయినదిగాని అశ్వ పతులను, గజపతులను జయించుట కవకాశము లేకపోయి నది. అతడా ప్రయత్నములు చేయ ప్రారంభించు నప్పటికి, అతనికి కాలము సమీపించినది. అతడయిదారేండ్లమాత్రమే రాజ్యపాలనము జేసెను.

సహజముగనున్న కుటిల స్వభావమునుమాన్ప నెవరి తరము! వీరనరసింహరాయుని కామష్టబుద్ధి యింకను పోలేదు. మహామంత్రి తన సంతతివారికి గాకుండ సామ్రాజ్య మును తన యనంతరము కృష్ణదేవరాయని కిచ్చునని యతి డనుమానపడెను. అతడనేక పర్యాయములు కృష్ణదేవ

రాయుని సంహరింపవలెనని యూహించెను. గాని మహా మంత్రికి భయపడి సాహసింపలేక పోయెను. తానాక్రూర కార్యమున కొడిగట్టినచో తనను, తన సామ్రాజ్యమును నామరూపములు లేకుండ మహామంత్రి చేయగలడని యత డనుకొనెను. ఏమి జేయుటకును దోచక యతడట్లే తన కుటిల స్వభావమును మరుగుపరచి యింతకాలము జరుప గలిగెను.

ఇప్పుడు వీరనరసింహరాయలు రోగపీడితుడయ్యెను. అతని కవసానదశ ప్రాప్తించినది. గత్యంతరము లేక యత డొకసమయమున తిమ్మరుసును రావించి "మంత్రిపుంగవా! నేనిక జీవించుట కష్టసాధ్యము. నా తండ్రి యాజ్ఞానుసారముగ నీవు నన్ను వజ్రసింహాసన మెక్కించి నాచే సామ్రా జ్యము నేలింప జేసితివి. నేనిట్టి సామ్రాజ్య పదవి నధిష్ఠించి జన్మ సార్థక్యము గావించుకొనుటకు కారణము నీ యనుగ్ర హమే. నీవు నా జనకుని జూచినట్లే నన్నును జూచితివి. ఆవిధముగనే నా పుత్రునిగూడ జూడవలెను. నీవు నాతండ్రి యాజ్ఞను పరిపాలించినట్లు నా యాజ్ఞలనుకూడ పరిపాలించ వలెను. నా యనంతరము, నా కుమారుడైన తిరుమలదేవ రాయుని సింహాసన మెక్కింపవలసినదని నా యాజ్ఞ. నా కిపు డొక సందేహము గలదు. నా యనంతరము నీవు కృష్ణదేవ రాయునికి బట్టము గట్టించెదవని నే ననుమానించుచున్నాను. కాబట్టి కృష్ణదేవరాయునివలన నారాజ్యమున కేవిధమగు యుపద్రవము రాకుండ, అతని కన్నులను పెఱికించి తెప్పించి

చూపుము. అంతవరకు నా ప్రాణములు పోవు. ఇది నా యాజ్ఞ. నెరవేర్పుము" అనెను.

ఈ పలుకులు మహామంత్రి హృదయమునకు ములుకులై నాటినవి. అత డొకింతసేపు మౌనమువహించి పిమ్మట గంభీరముగ "రాజేంద్రా! ఈ స్వల్పవిషయమునకా మీరింత పరితపించుట. ఇది మనసున నుంచుకొని బాధపడకుడు. నే నీ క్షణమున నేగి నీకార్యమును నెరవేర్చి వచ్చెదను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

"రాజులు రాక్షసులా! రాక్షసత్వమే వారిలో నప్పు డప్పుడు మూర్తీభవించుచుండునుగాబోలు. కాకున్న మానవ మాత్రు లీ సాహసకార్యముల కొడిగట్టుదురా! ఎంతక్రూరుడు! పాషాణహృదయుడు! ఎంతటి యవివేకి! నిజ కార్యాయత్త చిత్తుడగువానికి వివేకజ్ఞానము నశించునేమొ! కృష్ణదేవ రాయనికి విద్యాబుద్ధులు గఱపి, పెంచి పెద్దవానినిజేసినది నేను. నే నతి గారాబమున పెంచిన మొక్కను ద్రుంచి వేయ నీ సార్వభౌముడు నా కాజ్ఞాపించినాడు. ఎంతటి బుద్ధిహీనుడు! ఓహో! కృష్ణదేవరాయని కా యీవిపత్తు! మహామంత్రి జీవించియుండ నట్టిది జరుగునా! నాపుత్రుడగు గోవిందునికన్న, కృష్ణదేవరాయని యందే నా కెక్కుడు ప్రేమ. చేరదీసి పెంచిన మమకార మతిబలవత్తరము. సామ్రాజ్యమున నాకు కన్నులుగాఱవని ఎనిమిదేండ్ల తిరుమలరాయడా తగినవాడు!- హాస్యాస్పదము!- కానిమ్ము! మోసమునకు మోసమే యవసరము. ప్రభువాక్య పరిపాలనమా? అదో

మము నా కంటదు. సామ్రాజ్యమును సంరక్షించు ధర్మ మంతకన్న ముఖ్యము........" అని తిమ్మరు సనుకొనెను.

తిమ్మరు సాక్షణమే తన నివాసమున కరిగి రహస్య ముగ కృష్ణరాయు నటకు రప్పించుకొని కన్నుల నీరు గార్చుచు "కృష్ణరాయా! వింటివా మీ యన్నగారి యాజ్ఞ? అతడు తన కుమారునకు బట్టము గట్టవలయు ననియు, అందులకు నీ వాటంకపడుదు వేమోనని నీకన్నులు పెరికించి తెచ్చి చూపవలె ననియు, నా కాజ్ఞాపించెను. పిడుగువంటి ఈ వార్త కృష్ణరాయుని, నిశ్చేష్టుని జేసివైచెను. అతడట్లే శిలాప్రతిమవలె నిలువబడి యొక క్షణకాల ముండెను. అతని కేమిచేయుటకును తోచలేదు. నోట మాటరాక యితడు తడబిడ పడుచున్నట్లు గోచరించెను. ఇంటి ముంజూరునుండి గారు వర్షబిందువుల మాడ్కి మరుక్షణ మాతని కనులవెంట నీరు గారజొచ్చెను. నవనీత హృదయుడగు తిమ్మరు నీ దృశ్య మును జూడజాలక కృష్ణరాయునిపై తన హస్తము నుంచి "వత్సా! భయపడకుము. నేను బ్రతికి యున్నంతవరకు నీ కేయాపదయు రాదు" అని బుజ్జగించెను. కృష్ణరాయు డంతట తిమ్మరుసు పాదముల వ్రాలి "అప్పాజీ! తిప్పాంబ విషప్రయోగమున మరణించకుండ నన్ను గాపాడి పెంచి, పెద్దవానిని జేసి విద్యాబుద్ధులు గఱపి యింతవానిని జేసితివి. ఇప్పటికిని కంటిరెప్పవలె నన్ను గాపాడుచుంటివి. నీకన్న నితర దైవములు నాకు లేరు. రక్షించినను, భక్షించినను నీవే దిక్కు.

కాని యీ సందర్భమున నొకవిషయము మాత్రము మీకు చెప్పదలచితిని. నేనిప్పటివరకు మాయన్నకుగాని, సామ్రాజ్యమునకుగాని చేసిన ద్రోహమెద్దియు లేదుగదా! తన కుమారుని రాచరికమునకు నేనడ్డువత్తునని కదా యతడు నా కన్నులను పెరికింప యాజ్ఞాపించినది. నాకే సామ్రాజ్యముతో సంబంధము లేకుండ వైరాగ్యవృత్తిబూని, సన్యాసినై యేయరణ్యములకో బోదును. నాదు కన్నులనుదీసి నన్ను హింసింపకుము. అట్లు కాదా నన్నొక్క పర్యాయము సంహరింపుము. మీకు పుణ్యముండును" అని చెప్పుచు పసిబాలునివలె ఏడువనారంభించెను. తిమ్మరుసు పలుకున నీరయు అతని వైపు తిట్టును "కృష్ణరాయా! చెప్పితినిగదా, నేనున్నంతవరకు నీకే హానియు వాటిల్లదని. నిన్ను కాపాడి రక్షించి వజ్రసింహాసన మెక్కించగలను. కాని నేజెప్పినట్లు ప్రవర్తింపుము. నీవు నరసింహరాయలు మరణించునరకు నీ వెవ్వరికంట బడక నా మందిరముననే దాగియుండుము. భద్రముసుమా!" అని చెప్పి తిమ్మరుసు సోదరుని రహస్యముగ దాచెను.

అనుకొన్నట్లు మంత్రి యొక గొఱ్ఱెమేక కన్నులను తెప్పించి పట్టుకొనిపోయి, చచ్చుటకు సిద్ధముగనున్న వీర నరసింహరాయలకు చూపెను. అతడా కన్నులనుజూచి పరమానంద భరితుడై తన కుమారుని తిమ్మరుసునకు కొప్పగించి ప్రాణముల విడిచెను.

సర్వజ్ఞుండగు మహామంత్రి చేయలేని దేమున్నది? అతడే కర్ణాట సామ్రాజ్యమునకు సర్వాంగరక్షకుడు. అత

డేమి యొనర్చిన నెవరు గాదందురు ? అతిసులభముగ, అనాయాసముగ, మహాసామ్రాజ్య వైభవము నంతయు నతడు కృష్ణదేవరాయని హస్తగతము గావింప నిశ్చయించుకొనెను. కృష్ణరాయడే సహాసార్హుడగు సార్వభౌముడని తిమ్మరుసు నమ్మకము. తిమ్మరుసే తమ కేడుగడయని నమ్మి పిశ్వాసముతో గొలుచుచున్న ప్రజలుగాని, తిమ్మరుసును పితృసమునిగా భావించుచు వినయ విధేయతలతో ప్రవర్తించుచున్న భృత్య పరివార సామంత మంత్రివర్గముగాని, కృష్ణరాయని పట్టాభిషేకమున కాటంకము చెప్పలేకపోయిరి. మీదుమిక్కిలి శ్రద్ధతో నందరును నాటి వినోదముల పాల్గొనిరి.

1509 వ సం॥రం ఫిబ్రవరి 4 , తేదీన పట్టాభిషేక మహోత్సవమును జరుపుటకు శుభముహూర్తము నిశ్చయింప బడి సామ్రాజ్యమందంతటను ప్రకటింపజేసెను. మహారాజులకు, సామంత నృపతులకు, దండనాయకులకు ఆహ్వానములు పంపబడినవి. విజయనగర మత్యద్భుతముగ నలంకరింప బడినది.

పట్టాభిషేక మహోత్సవమును గనులార వీక్షించి యానందించుట కనేక దేశములనుండి ప్రజ లరుదెంచిరి శ్రీరంగము, నంద్యాల, గండికోట, కొచ్చెర్లకోట, వెలుగోడు మున్నగు భూనాధులును, దుర్గాధిపతులును పలువురు దండనాథులును మహోత్సవమును దర్శింప నేతెంచిరి. మహామండలేశ్వరులైన రాజు లనేకులు కృష్ణరాయనికి కానుక లంపిరి. శుభముహూర్తము సమీపించినది. కృష్ణ

రాయునికి సుగంధ ద్రవ్యముల పన్నీట జలకమార్చి మణికిరీటాది సర్వాభరణముల సమర్పించి, వివిధాలంకారముల శుభశోభితుని జేసి సిద్ధపరిచిరి. తిమ్మరుసంతట కృష్ణరాయుని బిలిచి తనవెంట ఆలోచనా మందిరమునకు గొనిపోయి రహస్యముగ నితరులు జూడకుండ నతని చెంపమీద నొక బలమైన దెబ్బ కొట్టెను. కృష్ణరాయలా దెబ్బను దిమ్మెరపోయి కనుల నీరు నించుచు కొంతసేపటికి తెప్పరిల్లి తిమ్మరుసును వీక్షించెను. తిమ్మరుసాతని చేరదీసి, కౌగలించుకొని, ముద్దాడి "కృష్ణరాయా! బాధపడితివి గాబోలు! నన్ను దూషింపకుము. ఈపని జేయుటకు చేతులాడక యింతకాలము మిన్నకుంటిని. గాని, యిప్పుడు తప్పనిసరియైనది. మన్నింపుము" అని యనెను.

కృష్ణరాయుని కేమియు దోచలేదు. "కంటిరెప్పవలె గాపాడుచు, వేయికన్నుల వీక్షించుచు, తన్ను కాపాడి రక్షించుచున్న గురుదేవుడగు మహామంత్రి నేడిట్టులేల చేసి యుండును? ఇందుల కేదియో కారణ ముండకపోదు—" అని యనుకొనుచు "అప్పాజీ! నిర్హేతుకముగ నన్ను మీరు దండింతురా? నా బాగోగులు మీవిగా భావించి నన్నీస్థితికి గొనివచ్చితిరి. నా మేలు గోరియే యీ పని చేసియుందురని నా నమ్మకము. ఈ యనుభవము నా కానందప్రదమే" అని విధేయుడై నిలువబడెను.

"కృష్ణరాయా! నీ వింతటి సహనశక్తిగలవాడ వని యెరుంగుదును. నీ వింతవరకును గారాబమున పువ్వులలో

జెరిగితివి. ఆగర్భశ్రీమంతుడవగు నీకు సుఖములేగాని కష్టములు దెలియవు. ఇప్పుడు నీవు బహుజన పరిపాలనాభారము వహింపబోవుచుంటివి గదా! నీ కన్ని విద్యలు నేర్పించితిని గాని దండపారుష్య మెట్టిదో నీ వింతవరకును గ్రహింపలేదు. ఈ బాధ నీ కనుభవమున నుండుట ప్రజలపాలిటి భాగ్యమగును. ఈ యనుభూతివలన నీ విక ముందు ప్రజలను క్రూరదండనపాలుగావించక ప్రవర్తించ గలవు. చూచితివా! పది లక్షల వరహాలతో నిండియున్న బొక్కసమును, సామ్రాజ్యమును, రత్నసింహాసనమును నీ కిప్పుడు స్వాధీనపరచుచున్నాను. కీర్తికాముడవై యాచంద్రార్కస్థాయిగా సామ్రాజ్యము నేలుకొనుము” అని తిమ్మరుసు సతిసిని దీవించెను.

కృష్ణరాయ డానంద పరవశుడై “మహాప్రసాద” మని వినయుడై తిమ్మరుసునకు పాదనమస్కారము చేసెను. ఇప్పటి వరకును వారిద్దరు గురుశిష్యులేగదా! ఇక ముందతడు సార్వభౌముడు. ఇతడు మహామంత్రి!

పట్టపు టేనుగుల కలంకారము జేసి సిద్ధము గావించిరి. శంఖ కాహళ భేరీ ప్రచండ వాద్యారావంబులు ఘోషన దిగంతరాళములునిండ మహావైభవముతో కృష్ణరాయని మత్తగజముపై నెక్కించి, తిమ్మరుసు మరియొక గజముపై నధిష్ఠించి, నూరేగింపునకు బయలుదేరిరి. సామంతరాజులు, రాజబంధువులు, కవి, గాయక, పండిత, పౌరోహితులు, భృత్యా. పరివారము వెంట నరుదేర, మంగళవాద్యములతో కృష్ణ

రాయుడు నగరమంతయు నూరేగి, అంతటను పౌరులు సమర్పించు దివ్యహారతుల స్వీకరింపుచు రాజమందిరమున ప్రవేశించెను. శుభముహూర్తమున వేదపఠనము జరుగుచుండ కవిపండితు లాశీర్వదింప ప్రజలు జైవెట్ట కృష్ణదేవ రాయలు రాజలాంఛనములతో రత్నసింహాసన మధిష్ఠించెను. తిమ్మరుసు నీ దృశ్యావలోకనమునతన్మయుడై అనిర్వచనీయానంద మనుభవించెను.

"పట్టాభిషేక మహోత్సవమున కితర సీమలనుండి వచ్చిన వారందరికి గౌరవ ప్రదమగు వస్త్రసమర్పణము జరిగినది. విలువగల విందులతోను, కవిసన్మాన సభలతోను, గాయకశ్రేష్ఠుల కచేరీలలతోను, వివిధ వినోదములతోను మరినాలుగు దినములు ముచ్చటలు జరిగినది. అందరు పెమ్మట మర్యాద మన్ననలతో నెవరి నెలవులకు వారేగిరి.

పట్టాభిషేకా నంతరముగూడ కృష్ణదేవరాయలుకొంత కాలము రాజ్యభారమంతయు తిమ్మరుసు పైనుంచి తాను తిమ్మరుసు చెప్పినట్లు ప్రవర్తింపుచుండెను. కాని మంత్రికి నడవడినచ్చలేదు. సార్వభౌముడన్ని విషయములు తెలిసికొనుట మేలనియు, రాజకార్యములన్నియు నతని కర్థము కావలెననియు, తిమ్మరు సభిప్రాయము. తిమ్మరు సొకనాడు కృష్ణరాయని బిలిచి "ప్రభూ! రాచకీయరంగముల మీరు తగు శ్రద్ధ వహింపవలెను. వెనుకటివలెగాక నిప్పుడు ప్రతిస్వల్ప విషయమును స్వయముగ నెరింగి తగురీతి ప్రవర్తించుచు ప్రజలను సుఖపెట్టవలయును. ఎల్లకాలమిట్టు లితరులపై రాజ్య

భారముంచుట మీకును రాజ్యమునకును శ్రేయస్కరము గాదు” అని చెప్పెను.

కృష్ణ:— మంత్రిపుంగవా ! అఘట ఘటనాసమర్థులగు మీవంటి అమాత్యశేఖరులుండ మేమెటులున్న నేమి ! ఇష్టానుసారము విర్విచారముగ మేము సుఖించినను ప్రమాదముండదు. అసమాన ప్రజ్ఞావిశేషములు గల మీవంటి రాజనీతివేత్తలు మంత్రులుగ మాకు లభించుట మాభాగ్యము.

తిమ్మ:— దేవా ! అట్లెప్పుడును తలచగూడదు. ప్రభువుల యాజ్ఞానుసారము మేము ప్రవర్తింపవలసిన వారము. అట్లు గాకున్న ననేక కష్టనష్టములు సంభవించును. ఒకప్పుడు ప్రజలు దురభిప్రాయపడుదురు. తమ పోకడలను బట్టియే రాజ్యము నడచుచుండును.

కృష్ణ:— అనుభవపరులు తమకు దెలియని దేమున్నది ! ఇక ముందట్లే నేను శ్రద్ధవహించగలను- సరిగాని మన వీర నరసింహదేవరాయని పుత్రుడగు తిరుమలరాయని, ఓబాంబికా పుత్రుడగు అచ్యుతరాయని గూర్చి మీ రేమి యాలోచించితిరి ?

తిమ్మ:— ఆలోచించుట కేమున్నది ? పట్టాభిషేక మహోత్సవ సమయమున వారిని బంధించి యుంచితిమి. ఇంక వారి నట్లుంచుట పాడికాదు. పాప మా బాలురు నిరపరాధులు గదా ! వారి నిప్పుడే విడుదల గావించెదను. గాని వారిని రాజధాని నగరమున నుంచుట శ్రేయస్కరము

కాదు. వీరెంత దూరమున వారి నుంచి రక్షించుట మేలు. ప్రభూ ! ఇంకొక మాట. వీరనరసింహరాయలు మీకు ద్రోహము గావింప ప్రయత్నించినను మీరు మాత్ర మతనిపుత్రుని కపకారముచేయరాదు. వీరనర సింహరాయలు మరణించునప్పుడు తనకుమారుని నాకప్ప గించి ప్రాణములువిడిచెను. అతనిని రక్షించుట నావిధి.

కృష్ణ:— మీరెంతటి దయార్ద్రహృదయులు! అట్లే మీ యిష్టానుసారము చేయుడు. వారివలన ముప్పు వాటిల్ల కుండ జూడవలసిన బాధ్యతమీది.

తిమ్మ:— అందుల కేగదా నీయత్న మంతయు. వారిని చంద్ర గిరి దుర్గముననుంచి రక్షణకొరకట కొంతసైన్యమునుంచి జీవనార్థము వారికి కొంత దేశము నిచ్చి వేయుదము. వారట స్వేచ్ఛగా సుఖజీవనము చేయగలరు. ఇట్లు చేసిన మీయుదార స్వభావమును నురింత తేటతెల్లము కాగలదు.

కృష్ణ:— చక్కని యాలోచన చేసితిరి. ఆయేర్పాటుల నిప్పుడే చేయింపుడు.

తిమ్మ:— అవశ్యము.

కృష్ణ:— మంత్రిపుంగవా! నాకొక కోరికగలదు. నీవు తోడ్పడిన........

తిమ్మ:— సందేహమేల ?

కృష్ణ:— ఈ సామ్రాజ్యము నార్జించిన సాళ్వ నరసింహరా యుడు గాని, తదుపరి నా తండ్రిగాని, అనంతరము నా సోదరుడుగాని, సాధింపజాలక విడిచిపెట్టిన కార్యమును

నేను నిర్వహించవలెను. రాచూరు, ముదిగల్లుదుర్గముల వశపరచుకొని గజపతులను బారద్రోలి దక్షిణ హిందూస్థానమున నేకచ్ఛత్రాధిపత్యమును వహించి పరిపాలించవలయునని కుతూహలపడుచున్నాను. మహాశయా! దుష్ట శిక్షణమును, శిష్ట రక్షణమును గావించి కీర్తిగాంచునటు లనుగ్రహింపుము.

తిమ్మ:— ప్రభూ! నాప్రతినయు నదే! దిగ్విజయయాత్రకు అనుకూలమగు ప్రయత్నముల నిప్పుడు జేయుచున్నాను. ఇందులకుమతికొంత కాలమాగవలసి యుండును. అశ్వపతులును, గజపతులును మిగుల బలాఢ్యులు. వారిని జయించుటకు తగిన బలమును సమకూర్చుకొనవలెను గదా! వేగిరపడక ప్రథమమున రాజ్యాంగమును బలపఱచుకొని సైన్యసంస్కారము గావించి అర్థంబుల బొక్కసముల నింపవలెను. అవసరములగు నిక్కార్యముల నన్నింటిని నేను త్వరలో పూర్తిచేయగలను. మీరు సంగ్రామ ధనంజయులని నే నెఱుంగుదును. శత్రువుల నవలీలఁ జయింపగలరు. కొంత కాల మోపికపట్టుడు.

కృష్ణ:— అట్లే జరుగనిండు. తమ ప్రజ్ఞాబలమున నసాధ్యములు సాధ్యములగును. మీ యిచ్చవచ్చినట్లు రాజ్యాంగ సైన్యసంస్కారముల గావింపుడు.

ఉభయులును కొంత కాలమట్లు ముచ్చటించుకొన్న పిదప కృష్ణదేవరాయలు సంభాషణము నాపి లేచి వెళ్ళుటకు బయలుదేర తిమ్మరుసు కొంతదూర మరిగి పంపివచ్చెను.

## ౧౫

మహామంత్రియగు తిమ్మరుసు సంస్కృతాంధ్రములందు నసమాన పాండిత్యము గలవాడేగాక కర్ణాట—భాషలలోగూడ మంచి ప్రవేశ మున్నవాడు. ఇతడు సంస్కృత బాలభారతమును వ్యాఖ్యానించి పేరుగాంచెను. ఇతడు భాషాభిమానము గలవాడగుటచేతనే అల్లసాని పెద్దనామాత్యుడు, నందితిమ్మనామాత్యుడు మున్నగు కవీంద్రులు పలువురు ఆస్థానమున జేరిరి. కృష్ణదేవరాయలును సాహిత్యప్రియుడు గావున, కవీశ్వరుల కధిక గౌరవము లభించినది. మహామంత్రి భాషాపక్షపాతము గలవాడై, విద్యాగోష్ఠి కువ్విళ్లూరుచుండువాడగుట కొందరు కవిశేఖరులు మంత్రివర్గమున సైతము చేరిరి. పెద్దనాది ప్రసిద్ధకవులు నిరంతరము రాయుని వెంబడించుచుండిరి. వీరికి రాయనికడను, మహామంత్రియొద్దను సర్వస్వాతంత్రములును గలవు. తిమ్మరుసు రాజ్యాంగ సంస్కరణముల యందెగాక కవితాగోష్ఠియందును భాగస్వామియై కవులను గౌరవించుచుండెను. కృష్ణరాయలు తిమ్మరుసు శుశ్రూషలలో పెరిగిన వాడగుట విద్యావిషయమున గూడ ప్రజ్ఞగలవాడై ప్రఖ్యాతి గాంచుచుండెను. సరస కవితా

విలాస లాలసుడై ప్రసిద్ధకవీంద్రుల పలుకుదేనియల తనివార గ్రోలి, రాయలుగూడ నుభయభాషలందునుకవిత్వమును చెప్ప గలిగి ఖ్యాతిగాంచెను. తిమ్మరుసుమూలమున కృష్ణదేవ రాయని కీర్తియు, అతనికారణమున తిమ్మరుసు ఖ్యాతియు విద్యాధిక ప్రపంచమునకు విదితమైనది.

కవీశ్వరు లెవ రేతెంచినను, రాయలకన్న ముందు తిమ్మరుసు వారి కాతిథ్య మిచ్చి సత్కరించుచుండుటవలన నతనికి కవీంద్ర పక్షపాతియని పేరువచ్చినది. ఇతడు పలువురు కవీంద్రులకు రాయలచే నగ్రహారము లిప్పించెను. రసికుడగు కృష్ణరాయనికిగూడ కవితాగోష్ఠియన్న నత్యంత ప్రేమ. కవుల నెందరినో సత్కరించి సన్మానించెను. పెద్దనామాత్యు నికి "ఆంధ్రకవితా పితామహు" డన్న బిరుదము నొసంగెను.

కృష్ణరాయలు చక్కగ చదరంగ మాడగలడు. ఆకారణమున నందు ప్రజ్ఞగలవారి నందరిని రావించి గౌర వించుచుండును. కొప్పోలు గ్రామకరణమగు బొడ్డుచర్ల తిమ్మ నామాత్యుండను కవీంద్రుడొకడు రాయనితో చదరంగ మాడు కుతూహలమున వచ్చి తిమ్మరుసును దర్శించి తనకోరి కను విన్నవించెను. అతడు కవీశ్వరదిగ్దంతి యను బిరుదు గలిగి చదరంగపు టెత్తులు వేయుటయం దసమాన మయిన పాండిత్యము నార్జించెను. తిమ్మరుసీతని విద్యా బుద్ధుల కచ్చెరువంది రాయనియొద్దకు గొంపోయి యతనితో జతురంగ మాడుటకు వీలుకల్పించెను. కృష్ణదేవరాయ లాతని ప్రజ్ఞా విశేషముల దిలకించి యానందించుచు యత

నితో నాటలాడుచుండెను. కృష్ణరాయని పక్షమున నెంద రాలోచించి ఎత్తువేయుచున్నను అతడొక్కడే ఎదురెత్తువేసి ఆట గట్టించి వేయార్లు పందెము గొనుచుండెను. కొప్పోలు గ్రామమును కృష్ణరాయ పురమని పేరిడి సర్వాగ్రహారముగ రాయలితనికిచ్చి బహూకరించెను. సర్వవిధముల రాజ్యము నభివృద్ధి జేయవలెనని తిమ్మరుసాలోచించుచుండెను. ప్రపంచమునందింతటిగొప్పపట్టణము లేదేమో యనిపించునట్లు విజయ నగరమును పెంపొందించి మహావైభవములతో దులదూగించుటకు యత్నించుచుండెను. సామ్రాజ్యమునందెల్లెడల చిత్రకళాభివృద్ధియు, శిల్పకళాభివృద్ధియు గావించుట కేర్పాట్లు చేసెను. రమ్యసౌధములు నిర్మించుటకు నిపుణులగు పనివారలను నిర్మించెను. బౌద్ధులకు, జైనులకు చక్కని విహార మందిరముల నేర్పాటు జేయుచుండెను. తిమ్మరుసు స్వార్థ పరుడుగాక, నగరాభివృద్ధికిని, రాజ్యవిస్తరణమునకు పాటు పడుచుండుట గని రాయలధిక సంతోషమున నతని యిష్టానుసారము జేయనిచ్చుచు తాను మహాసామ్రాజ్య భోగముల ననుభవించుచుండెను. తిమ్మరుసు కృష్ణరాయనికి నసూయ జనించు మార్గమునంబోక తనపై ప్రభువునకు గాఢమగు విశ్వాసము గుదురునట్లు సంచరింపుచు తనకార్య కౌశల్యత్వమును జూపుచు జాగరూకుడై మెలగుచుండెను. అంతకన్న నతనికి గావలసినదేమున్నది?

తిమ్మరుసిప్పుడు దిగ్విజయ యాత్రకువలయు సాధన సంపత్తిని సమకూర్చుటకే తనకాలమంతయు వినియోగించు

చుండెను. అతని కిప్పుడిదియే ముఖ్యము. అనతి కాలమున పది లక్షల సైన్యమును సిద్ధము గావించి అవసరమయినచో— మరియొక పదిలక్షల సైన్యమును సమకూర్చుటకు తగు నేర్పాటుల చేసెను. ముప్పదివేల యాశ్విక బలమును ప్రశస్తమైన గజబలమును సమకూర్చెను. భాండారమున కావలసినంత ధనము నిలువ జేసి దుర్గములన్నియు సమస్తవస్తు సామగ్రులతో నింపివేసెను. భక్తివిశ్వాసములుగల శూరులగు సేనాపతులను నియమించెను. అగడ్తలను, అట్టళ్లను, జంత్రంబులను అనువు పరచెను. అసమర్థులను తొలగించి సమర్థులను నియమించెను.

తిమ్మరుసు సాధ్యమైనంతవరకు మహాసేనాధిపత్యమును మండలాధిపత్యములు తెలుగువారికే యొసంగుచుండెను. సామ్రాజ్యమున తెలుగువారికే మంచిపలుకుబడి లభించెను. గాని సైన్యమున మహమ్మదీయులను మతాంతరులనుగూడ జేర్చెను. గోవాపరిపాలకులగు పాశ్చాత్యులయిన పోర్చుగీసువారిని ఆదరించి గౌరవించు చుండెను. అందువలన తిమ్మరుసు పరిపాలనము సర్వజన సమ్మతమయినది. అతడు సామ్రాజ్య విభవమును పెంపొందించుటకును, విదేశములతో సంబంధ బాంధవ్యములు గల్పించుటకును అన్యదేశములతో వ్యాపారము సాగించెను. ఇట్లనేక విధముల నతడు దేశాభివృద్ధి కరములగు పనులను జేయించుచుండెను.

## ౧౬

తిమ్మరుసు దిగ్విజయయాత్రకు చాలినంత బలము సమకూర్చి సిద్ధము చేయించిన తదుపరి ద్రావిడదేశమును గూర్చి తీవ్రముగ నాలోచించెను. ద్రావిడదేశమును జయించి సక్రమముగ కప్పము రాబట్టుకొనుటకై యతడు విజయప్పనాయకుని, వెంకప్పనాయకుని, కృష్ణప్పనాయకుల నియోగించి లక్ష సైన్యముల వారికి స్వాధీనపఱచి దండయాత్రలో ఆచరించవలసిన కార్యక్రమము వరుసగా తెలియజెప్పి సాగనంపెను. మహామంత్రి యాజ్ఞానుసారము విజయప్పనాయకుడు సైన్యసమేతుడై దండయాత్రకు బయలువెడలి సులువుగ వేలూరు ప్రాంతమును వశపరచుకొని వేలూరు కార్యస్థానముగ నేర్పరుచుకొని రక్షణకయి కొంతబలము నుంచుకొని కార్యసాధకుడై కప్పములు గొనుచుండెను. చిత్తూరు, తంజావూరు, తిరుచనాపల్లి, తొండమండలము, మళయాళము మున్నగు రాష్ట్రముల ప్రభువులందరు రాయనికి విధేయులై కప్పములు చెల్లించుచుండిరి.

తిమ్మరుసే దక్షిణదేశమును మూడు ఖండములుగా విభజించి ముగ్గురు పరిపాలకులను నియమించెను. కృష్ణప్ప

నాయకుడు జింజీలో నివసించుచు నెల్లూరు మొదలుకొని కొల్లడము నదివరకునుగల దేశమును జాగరూకుడై పరిపాలించుటకున్ను, కావేరీ నదీప్రాంత ఫలవంతమైన ప్రదేశమును విజయరాఘవ నాయకుడే యేలుటకును, వెంకప్పనాయకుడు మాళవ దేశమున కధికారిగా నుండుటకు, మహామంత్రి యధికారముల నొసంగెను. ఈవిధముగ పూర్వ కర్ణాట ద్రావిడదేశము నంతటిని లోబరచుకొని మూడుకోట్ల ద్రవ్యమును బొక్కసమున బోయించెను.

దిగ్విజయ యాత్రకు సర్వమును సిద్ధమైనది గదా? తిమ్మరుసుప్రధాని కృష్ణరాయనికి తాను సమకూర్చిన సైన్యములను, అశ్వబలమును, గజబలమును తదితర వస్తువాహనాదికములను బొక్కసమునందలి ద్రవ్యమును జూపించెను. కృష్ణరాయ లాశ్చర్యమున నంతయు దిలకించి అపరిమితానంద భరితుడై తిమ్మరుసును బహువిధముల కొనియాడెను. "మంత్రిపుంగవా! ఇంక శత్రువుల నవలీల జయించి దుర్గముల స్వాధీన పరచుకొని విజయలక్ష్మిని చేపట్టగలను. దిగ్విజయ యాత్రకు త్వరలో శుభముహూర్తము నిర్ణయింపుడు"

తిమ్మ:—చిత్తము. సత్వరముగ జేయించెదను.

కృష్ణ:— ప్రథమమున తురుష్కుల జయించి పూర్వ దిగ్విజయ యాత్రకు బయలుదేరుదమా? లేక........

తిమ్మ:— రాజేంద్రా! ఆలోచింపవలసిన ముఖ్య విషయమిదియే! బిజాపురుసుల్తానుకన్న నేను గజపతి బలవంతు

డుగ నున్నాడు. గజపతి దేశము మిాఱిన సంపదలతో నిండియున్న గొప్ప దేశము. అందువలన గజపతి వలననే మనకెక్కుడు హాని రావచ్చును. కాబట్టి గజపతిని జయించుట మన ప్రథమ కర్తవ్యము. అదియునుగాక బహామనురాజ్యము ఛిన్నభిన్నముగా నైదుభాగములై యున్నది. ఈ సుల్తానులను విడి విడిగా జయించుట మన కతిసులభము. మఱియు మునుముందు మనము బిజాపుర సుల్తానుపై దండయాత్ర సలిపినచో సుల్తానులందరేకమై మనపైదాడి సలుపుదురేమొ! అప్పుడు కార్య మసాధ్య మగును. ఆసమయము నెరింగి గజపతి మన రాజధానిని ముట్టడించెనేని ముప్పు వాటిల్లునుగదా? కనుక ప్రతాప రుద్ర గజపతిని జయించుటయే మన ప్రథమ కర్తవ్యము.

కృష్ణ:— గజపతితో మనము పోరాటము పెట్టుకొన్న తరు వాత శామినిసుల్తానులు మన రాజధానిని ముట్టడించి నచో?

తిమ్మ:-- అట్లు జరుగుట కవకాశము లేదు. బిజాపూరుసుల్తా నిదివరకె మనతో యొడంబడికచేసుకొని యున్నాడు. అట్లుగాక ఒకవేళ యతడు దుష్టుడై మన రాజధానిని ముట్టడింప యత్నించునేని యితని నవలీల జయించుటకు కావలసినంత బలము నిటకాపుంచి విశ్వాస పాత్రుడైన సేనాని నొకని రక్షణ కుంచవచ్చును.

కృష్ణ:—ఇతరులపై నగరరక్షణభారముంచు టంత శ్రేయస్క రము గాదేమో?

నిన్ను శ్లాఘించి నీకీ పదవి నీయఁగోరెను. నీ విప్పుడు నగరాధ్యక్షుఁడ వైతివి. అప్రమత్తుఁడవై నగరమును సంరక్షింపుచు నీ ర్తిగాంచుము. తురుష్కులు తమ సరిహద్దును దాటి రాకుండ వేయికనుల గనిపెట్టి యుండవలెనుసుమా! మన మెందరినో యలక్ష్యము జేసి కృష్ణరాయని సింహాసన మెక్కించితిమి. అతనిని అతని సామ్రాజ్యమును వర్ధిల్ల జేయుట మన విధి. తమ్ముఁడా! ఈ మాట మరచిపోవలదు. కృష్ణదేవరాయలు మనలను నమ్మి రాజ్యమును మన చేతుల యందుంచెను. ఈ గౌరవమును మనము దక్కించుకొనవల యును. ఏమాత్ర మశ్రద్ధ జరిగినను ముప్పు వాటిల్లును. నీకును నాకును ప్రాణాపాయము సంభవించుటయే గాక రాజ్యమునకు వినాశము గలుగును” అని అతనికి హెచ్చరికలు జెప్పి రాయని దండయాత్ర నగరంబున బ్రకటించుమని యానతిచ్చి యతనిని బంపెను.

రణభేరి మ్రోగినది. సేనాపతు లందరు తమతమ సైన్యములతో సిద్ధపడిరి. ఆ శుభదినమున మంత్రి సామంత సేనాధిపతులు, రాజబంధువులు, అధికారులు, పరివారము తన్ను గొలువ రాజేంద్రుడు రత్నసింహాసనారూఢుడై కొలువుండెను. ఆజ్ఞానువర్తులై కనక కలశంబుల బావన జలంబుల దెప్పించి మంగళోపకరణ శోభితంబు గావించిరి. పురోహితుల పుణ్యాహవాచనంబులును, మంగళాశీర్వాదంబులును, వందిమాగధ గీతంబులును జెలరేగుచుండెను. రాయలప్పుడు తిమ్మరుసు మహామంత్రికి సగౌరవంబుగ సర్వ

సైన్యాధిపత్యాభిషేక పట్టబంధం బొనర్చెను. తత్క్షణము నాయకులు శంఖముల పూరించిరి. అఖిలసైన్యము లందును భేరీమృదంగ పణవాది తూర్యనినాదంబులు మిన్నుముట్టెను. తిమ్మరు సవరిమితానందభరితుడై సార్వభౌమున కాయు రారోగ్యైశ్వర్యాభివృద్ధియు, సామ్రాజ్యాభివృద్ధియు గలుగు నటుల దీవించి సేనాపతుల వీక్షించి "దండనాథులారా ఈదిగ్వి జయ యాత్రలో గజపతులు, అశ్వపతులు మున్నగువారు మన శత్రువులం దరిమి వేసి దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును జరిపి హైందవ సామ్రాజ్యమును దృఢముగను శాశ్వతముగను చెక్కుచెదరకుండ స్థాపింప బ్రతిజ్ఞచేసితిని. ఇది నాయొక్కని వలన జరుగు కార్యముగాదు. ఈ మహోద్యమమునకు మీ అందరి సహాయసంపత్తియు, అత్యవసరము. మీరందరు యోధాన యోధులు. మీ శౌర్య ధైర్య సాహసముల బ్రద ర్శించుట కిప్పుడు తరుణ మాసన్నమయినది. స్వామి కార్య నిర్వహణానురక్తులగు మీవంటి వీరులయండ జూచుకొనియే మేమికార్యమును సాధింప సమకట్టితిమి. ఈ దండయాత్ర జయప్రదముగా నిర్వహింపవలసిన బాధ్యత మన యందరి యందును గలదు. ఇదియే మన ముఖ్యకర్తవ్యము. భగ వంతుడు మనకు తోడ్పడి విజయము ప్రసాదించుగాత !" అని హెచ్చరించెను. అనంతర మెవరిప్రయత్నముల వారు గావించుకొని సిద్ధపడుటకు లేచి వెడలిరి. నాటికి దర్బారు ముగిసెను.

సైన్యమంతయు నేడుభాగములుగా విభజింపబడినది. ఒక్కొక్క భాగమునకు ముప్పదివేల కాల్బలమును నాలుగు వేల గుఱ్ఱపుదళమును, రెండువందల యేనుగులును, యుండు నట్లేర్పాటు జరిగినది. ఈయేడు భాగములకు కందవోలు ప్రభువగు ఆర్వేటి శ్రీరంగరాజు, నంద్యాలరాజగు నారప రాజు, ఆకుపాడు దుర్గాధిపతి ఇమ్మరాజు, తిమ్మరుసుమంత్రి కుమారుడు కొండమరాజు, గండికోట దుర్గాధిపతి రామలింగన్ననాయుడు వెలుఁగోటి దుర్గాధిపతికుమార తిమ్మానాయుడు, గంగాధరరెడ్డి నను నేడ్వురను అధిపతులుగా నియమించిరి.

## ౧౭

మరునా టుదయమున సూర్యోదయ మగునప్పటికి దండ యాత్ర కనువగు శుభసమయము సమీపించినది. నగర మందంతటను యుద్ధవార్తలే చెప్పుకొనుచుండిరి. వీరమాతలు తమ పుత్రుల నాశీర్వదించి, రణోన్ముఖుల గావించుచుండిరి. అక్కసెల్లెండ్రు తమ సోదరులను బురికొల్పి ప్రయాణమునకు వలయు పరికరము లందిచ్చుచుండిరి. భార్యలు తమభర్తల ననురాగాతిశయముల బూజించి ఉత్సాహకరములగు వాక్యములతో దండయాత్రకు సాగనంపుచుండిరి. ఇంతలో భేరీ మృదంగ పణవాది తూర్యనాదంబులు మిన్నుముట్టెను. సైన్యాధిపతుల శంఖారావంబులును, గజతండముల ఘంటా నాదంబులును వందిమాగధుల కైవారంబులును చెలరేగుచుండ ప్రయాణభేరి మ్రోగినది. రాజపురోహితులు స్వస్తి వాచకముల ప్రారంభించిరి.

సకల సైన్యాధ్యక్షునకు మహామంత్రి యానతిచ్చుట తడవుగ ఉత్సాహ మినుమడింప ముఖ్య సేనాపతులు తమ తమ సైన్యములతోడను, పరివార జనంబులతోడను, ఒకరి వెనుక నొకరుగ బారులు తీరి నడువ నారంభించిరి.

రత్నమణిమయాలంకార భూషణ భూషితంబైన మత్త వేదండము నెక్కి, వెలిగొడుగులు మెరయుచుండ, శుభ శోభితమై రత్నప్రభా భాసితంబైన గరుడధ్వజ మలరారు చుండ శ్రీకృష్ణదేవరాయలు బయలుదేర, తిమ్మనామాత్యుడు సకల చమూపతిత్వపద భాసితుడై సమస్త సైన్యములను నడి పించుకొనుచు, దండయాత్రకు బయలువెడలెను. అల్లసాని పెద్దనామాత్యుడు మున్నగు కవీంద్రులును, శివాదీక్షితులు మొదలగు రాజపురోహితులును, గురువర్యులగు వైష్ణవ స్వాములును వారి ననుసరించిరి.

గజపతుల జయించు టంత సుళువైన పనిగాదు. ఉదయగిరి మొదలు రాజమహేంద్రవరము వరకు గల పూర్వాంధ్ర సామ్రాజ్య మంతయు బహుబల సమేతులగు గజపతుల స్వాధీనములో నుండెను. రాయల సైన్యము విజయయాత్రకై బయలుదేరి వచ్చుచున్న విషయమును ప్రతాపరుద్రగజపతి పినతండ్రియగు తిరుమలకాంతరాయుడు చారులవలన విని, గజపతి కీ వార్త నందజేసి తా నుదయగిరి దుర్గమును రక్షించుటకు బూనుకొనెను. పదివేల కాల్బల మును, నాలుగువందల యశ్వములును సమకూర్చుకొని దుర్గసంరక్షణకు సంసిద్ధు డయ్యెను. ఇది స్వల్పసైన్యమే యైనను, ఆహారపదార్థములు యెంత కాలమైన నిలిచి పో రాడ చాలియుండెను.

శ్రీకృష్ణదేవరాయల సైన్యము లొక్కుమ్మడివచ్చి ఉదయగిరిదుర్గమును ముట్టడించెను. దుర్గ మందున్న వారి

ఆహారపదార్థము లందకుండ జేసి పోరాడి, వశపరచుకొనవలె
నని, తిమ్మరుసును, రాయలును, ఊహ జేసి, కోటను ముట్ట
డించి యుండిరి. కొన్ని దినము లిట్లు జరుగ నింతలో ఉదయ
గిరిదుర్గ సంరక్షణార్థము గజపతి లక్ష సైన్యమును బంపెను.
ఈ సంగతి ముందుగనే తెలుసుకొని తిమ్మరుసు ఉదయగిరిని
ముట్టడించి యుండుటకు రాయసము కొండమురుసయ్యను
కొంత సైన్యముతో నుంచి రాయలనుగూడ నచ్చట నేయుండ
మని, తక్కిన సైన్యము నంతను దోడ్కొని తాను శత్రు
సైన్యము నెదుర్కొని పోరాటమును సాగించెను. ఉభయ
సైన్యము లొండొరుల డీకొని ఘోర సంగ్రామము జరుపు
చుండిరి. తిమ్మరుసు తన బుద్ధిబలముచేతను, శక్తిసామర్థ్య
ములచేతను వైరివీరుల నుక్కడగించు చుండెను.

ఉదయగిరి దుర్గమున కొండమురుసయ్య రాయనితో
గలిసి బహువిధముల బోరాడుచు, కొండలను బగులగొట్టించి
విశాలమైన బాటల నేర్పరుచుకొని దుర్గమున బ్రవేశించి
శత్రువుల జీకాకుపరచుచుండిరి. భయంకరమగు నాయుద్ధ
మున రాయలసైన్య మెంతయో నష్టపడెనుగాని తుట్టతుదకు
కృష్ణదేవరాయలా దుర్గమును స్వాధీనపరచుకొని తద్దుర్గాధి
పతియైన తిరుమలకాంతరాయుని బంధించెను. శ్రీకృష్ణదేవ
రాయలంత కొండమురుసయ్య నా దుర్గమున కధిపతిగానుంచి
కొంతసైన్యముతో తాను గజపతిసైన్యము నెదుర్కొన
నేగెను. పెద్దకాల మీతీరున నిరుసైన్యములకును ఘోర
సంగ్రామము జరిగెను. రెట్టించిన యుత్సాహముతో రాయల

సైన్యములు ముందునకేగుచు శత్రుసైన్యముల వెనుకకు దరుముచుండెను. క్రమక్రమముగ నిట్లు తిమ్మరుసు సైన్యము గజపతిసైన్యములను వెనుకకు దరుముకొనుచుబోయి అద్దంకి వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, కేతరము సీమ మున్నగు సీమలను వశపరచుకొనెను. గాని [illegible] కొండవీటి దుర్గమును లోబరుచుకొనుట కష్టతరమ[illegible] ప్రతాపరుద్రగజపతి ఇరువదివేల గుఱ్ఱపుదళములతోడను, అయిదు లక్షల కాల్బలముతోడను, కొన్నివేల గజబలములతోడను వచ్చి కొండవీటి దుర్గమును రక్షించుటకు నిలిచెను. అప్పుడుభయబలములకు తీవ్రమగు పోరాటముజరిగెను. తుదకు తిమ్మరుసుమంత్రి శత్రుదుర్గములను వశపరచుకొని, వీరభద్ర గజపతి మున్నగు ప్రాతసామంతుల నందరిని చెరగొనియెను. శౌర్యధనుడగు తిమ్మరుసు ప్రతిజ్ఞ నేటికి నెరవేరినది. ఇప్పటికి కృష్ణకు దక్షిణభాగమున గజపతిప్రభుత్వ మంతరించెను. చిట్టిగంగనామాత్యుని కోరిక లిప్పటికి నెరవేరెను.

అదృష్టమనగ కృష్ణదేవరాయునిదే యదృష్టము. ప్రతిభాశాలియగు మహామంత్రి మహాసేనాధిపతియై సైన్యములు నడుపుచుండెను. ఇన్నింటికి దోడు దైవబలమున్నది. కృష్ణదేవరాయలు విజయ విరాజితుడై సాటిలేని యశము నార్జించెను. ఈవిజయ యాత్రలో చెరగొన్న గజపతి సంబంధీకుల నందరిని రాయలు విజయనగరమునకు బంపివేసెను. కొండవీటి రాజ్యమును బాలించుటకు రాయలు తిమ్మరుసు మంత్రినే పరిపాలకునిగా నుంచెనుగాని కృష్ణరాయుని వెంట

తానుండవలసిన యవసరమేర్పడుటచే తిమ్మరుసు తన మేనల్లుడగు నాదెండ్ల అప్పామాత్యునికి కొండవీటి రాజ్యాధిపత్య మొసంగెను.

విజయ పరంపరావేశవివశుడై శ్రీకృష్ణదేవరాయలు సమరోత్సాహియై ప్రతాపరుద్రగజపతి నివాసస్థలమును, రాజధానినగరమునునగు కటకమును బట్టుకొనవలెనని యాలోచించెను. దూరాలోచన పరుడగు మహామంత్రి కిది నచ్చలేదు. అతడు రాయలతో "ప్రభూ! మనమిప్పటికే మనరాజధానిని విడిచి చాల దూరమే తెంచితిమి. సాహసమున శత్రుసంహారమొనర్చి విజయమును చేపట్టితిమి. ఇంతటితో తృప్తినొందక ముందునకు సాగిపోవుట మూర్ఖమగును. గజపతి బలపరాక్రమ సంపన్నుడగు శత్రువుగాని సామాన్యుడుగాడు. మన సైన్యమిప్పుడు క్షీణించియున్నది. ఈస్థితిలో మనము ముందునకు సాగిపోవుట ప్రమాదకరముఅని చెప్పెను. వీరాధవీరుడగు కృష్ణదేవరాయల కీవాక్యములు రుచించలేదు. అతడు—అప్పాజీ! అడ్డుచెప్పి నన్ను నిరుత్సాహపఱుపకుము. నీసహకారమును, దైవబలమును తోడైన శత్రువునవలీల జయించగలను. మనకీసైన్యము చాలకున్న విజయనగరమునుండి మరికొంత బలమును రావింపుము. కటకమును బట్టికొని, ప్రతాపరుద్రుని వశపరచుకొన్నగాని ఈవిజయయాత్ర పూర్తిగాదు. కాబట్టి వెంటనే సైన్యములకొరకు విజయనగరమునకు వార్తనంపి సేనను ముందుకు నడిపింపుము--అనిపలికెను. రాయలిట్టి భల్లూకపు పట్టుబట్ట తిమ్మరుసేమి చేయు

గలదు? అతనికిష్టము లేకపోయినను తుదకు సమ్మతింపవలసి వచ్చినది. విధిలేక తిమ్మరుసు సేనను ముందునకు సాగింపవలసి వచ్చినది.

తిమ్మరుసుకృష్ణరాయనితో రాజమంద్రేతర దుర్గమును ముట్టడింపబయలు దేరెను. మార్గమధ్యమున గజపతి సైన్యముల నెదుర్కొని యుద్ధము జేయుచు, ఉత్సాహమున వారిని తరుముకొని పోవుచుండిరి. కొంతకాలమునకు విజయనగరము నుంచి రాయలసైన్యము లధికమువచ్చి కలిసికొనెను. ఇట్లు కొన్ని లక్షలసైన్యమును నడిపించుకొనుచు, కృష్ణరాయలు కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశము నంతయు నాక్రమించి స్వాధీనపరచుకొని, గోదావరినిదాటి శత్రువులను బారద్రోలి రాజమహేంద్ర పురమును జయించి స్వాధీనపరుచుకొనెను.

కృష్ణరాయలు రాజమహేంద్ర పురమున కొన్నినెలలుండి, మెల్లమెల్లగ నొకదాని వెనుక నొకటి గరహితాపురము, పొట్లూరు, ఒడ్డాది మొదలగు మన్నె సంస్థానములను లోబరుచుకొని తుదకు రెట్టించిన సమరోత్సాహంబున తన సైన్యంబుల నడవి మార్గమున నడపించుచు కటకపురి వరకు గొనిపోయెను. కటకపురి గజపతి సామ్రాజ్యమునకు మూలస్థానముగదా! అంతట గజపతి క్రిందను ప్రాత సామంతులెల్ల రేకమై, గజపతికి సహాయార్థమరుదెంచి మితిమించిన సైన్యబలముతోను స్థానబలముతోను రాయల బలము నెదుర్కొని భీకరయుద్ధమును సాగించిరి. అప్పట్టున

రాయల సైన్యములు గజపతి సైన్యమునకన్న తక్కువగ నుండెను. పరిస్థితులన్నియు విపరీతమై, తుదకు రాయల కప జయము ప్రాప్తించునట్లు గోచరించెను.

మహామేధావియగు తిమ్మరుసుండ రాయల కప జయమా! అట్లెన్నటికిని జరుగదు. తిమ్మరుసు సీ విషమ పరి స్థితి గ్రహించి తన బుద్ధినైపుణ్యము మెరయ ప్రాంత సామంతులకు గజపతికిని అభిప్రాయ భేదముల గల్పించి చీల దీసెను. అంత గజపతి బలహీనుడై చేయునది లేక రాయ లతో సంధిచేసుకొని తన కుమారిత తిర్కాంబను రాయల కిచ్చి పెండ్లిచేసెను. ఈమెనే యన్నపూర్ణాదేవి యని కృష్ణ రాయ డాముక్తమాల్యదయందు పేర్కొనెను. ఈ మైత్రి వలనను, వివాహమువలనను, ఉభయ రాజ్యములకు విరోధము లంతరించి సంబంధ బాంధవ్యములు మెండయ్యెను. శ్రీకృష్ణదేవరాయ లావిధముగ జయలక్ష్మితోను, గృహ లక్ష్మితోను కటకమునుండి బయలుదేరి మహానందమున విజయనగరము ప్రవేశించెను.

పూర్వదిగ్విజయయాత్ర నుండి మగలివచ్చి రాయలు కొంతకాలము విశ్రాంతి గైకొనుచు రాచకీయ వ్యవహార ముల చక్కచేయుచుండెను. సైన్యాభివృద్ధికై తిమ్మరుసు మరికొంత కృషిజేసి క్రమశిక్షణమం దుంచెను. కృష్ణ రాయ డిట్లు కొంతకాల మాగి బహుళ సైన్యముతో దండ యాత్ర సాగించి రాయచూరు దుర్గమును ముట్టడించి బిజా పుర సుల్తానుతో ఘోరయుద్ధ మొనర్చి అతని జయించి దుర్గ

మును స్వాధీనపఱచుకొనెను. అనంతరము రాయలు ముదిగల్లు దుర్గమును ముట్టడించి జయించెను. కృష్ణరాయని ధాటికి మహమ్మదీయులు మరి తల ఎత్తలేదు. ఈ విజయములతో ఆంధ్ర సామ్రాజ్యము మరింత విస్తరించి తెలుగు వారి శక్తిసామర్థ్యములు జగజ్జేగీయమానము లయ్యెను. ఇప్పుడు గదా ఆంధ్రసామ్రాజ్య స్థాపనాచార్య బిరుదము మహామంత్రి తిమ్మరుసునకు లభించినది! గంగనామాత్యుని యభీష్టము సిద్ధించినది !

## ౧౮

ఏనాడు సాళువ నరసింహరాయడు కర్నాట సామ్రాజ్య రత్నసింహాసన మధిష్ఠించెనో, ఏనాడు మహానుభావుడగు గంగ నామాత్యుడు తనకు మహామంత్రిపదవి నొసంగి యాశీర్వదించెనో ఆనాడు మొదలు తిమ్మరుసు నలుబది సంవత్సరములు మహామంత్రిత్వమున విరాజిల్లెను. ఇతని యెదుట నేవురు రాజు లొకరివెనుక నొకరు రాజ్యమేలి మారిపోయిరి. ఏసార్వభౌముడును యితనిని గాదని ధిక్కరించి యుండలేదు. తిమ్మరుసుగూడ నట్టి యవకాశములు రాకుండ విధేయుడై భక్తిశ్రద్ధలతో సంచరించుచుండెను. పేరునకు మాత్రము వారు సార్వభౌములుగాని రాజ్యపరిపాలన మంతయు తిమ్మరుసు కనుసన్నలనే జరిగినది. దయార్ద్రహృదయుడగు తిమ్మరుసెప్పుడును ప్రజల కష్టసుఖములను గ్రహించి, వారి కనేక సదుపాయముల గల్పించి సుఖపెట్టెను. అన్నిమతములను మహాదరమున గౌరవించి, అందరి నన్నివిధముల సంతోషపరిచెను. గొప్పగొప్ప దేవాలయములను, మశీదులను, ధర్మశాలలను గట్టించి శిల్పకళాభివృద్ధి గావించెను. ఆశ్రితులకగ్రహారము లిప్పించి మెప్పులందెను. అన్నివిధముల ఆంధ్ర సామ్రాజ్యము నొకవెలుగు వెలిగించెను.

శ్రీకృష్ణదేవరాయ లసమాన పరాక్రమశాలియై సార్వభౌముడై మహారాజభోగము లనుభవించుచు, కొంత కాలము నిర్విచారముగ సుఖ ముండెను. అతని కొక యాలోచన జనించినది. తాను బ్రతికియుండగనే దన కుమారుని వజ్రసింహాసన మెక్కించి కనులార తానా వైభవము జూచి యానందించవలెనని యత డూహించెను. అప్పటి కా బాలుని వయ సారేండ్లు మాత్రమే. అయిననేమి? రాయలు చేయదలచిన దాని నెవ రాపగలరు? రాయల సంకల్పము కార్యరూపము దాల్చినది. అత డొక శుభముహూర్తమున తనపుత్రుని సింహాసన మెక్కించి తాను మంత్రియై తిమ్మరుసును కార్యనిర్వాహక కర్తగ నియమించి రాజ్యపాలనము సాగించెను. ఎనిమిదిమాసములు రాజ్య మందంతటను మహా వైభవముగ ఉత్సవములు జరిగెను. కొంతకాల మిట్లు జరిగినది.

జగన్నాటక సూత్రధారియగు భగవంతుని చేత లతి విచిత్రములు. ఎవ్వ డెవరి కేది ప్రాప్తించునో చెప్పగలవా రెవరు? ఉన్నటు లుండి యొకనాడు రాయల పుత్రు డగు బాలరాజున కేదో జాడ్య మంకురించి యతడు మృతి నొందెను. తానొకటి తలచిన దైవ మొకటి తలచిన ట్లైనది. తిమ్మరుసు కొడుకు విషము పెట్టించి యా బాలరాజును జంపించె నని సరిపడని కుటిలహృదయు లెవరో రాయల చెవిని వేసిరి, అంత నతడు యుక్తాయుక్త విచక్షణ జ్ఞాన శూన్యుడై, క్రోధావేశమున నొడలెఱుంగక మహామంత్రి

తిమ్మరుసును, దళవాయియైన యతని పుత్రుని, నగరాధ్యక్షుడైన యతని తమ్ముని చెఱసాలయం దుంచెను.

ఆనాటి సాయంకాలము శ్రీకృష్ణదేవరాయలు నిండు కొలువుండి, తిమ్మరుసును సభకు రావించి, కఠినముగ మాట్లాడుచు "నిన్నింత కాలము ప్రాణమిత్రునిగా జూచు కొనుచు గౌరవించుచుంటిని. ఈ సామ్రాజ్య పాలనా భార మంతయు నీవే వహించితివి. గాని, రాను రాను నీయందు నాకు విశ్వాసము నశించుచున్నది. నీయందొక విధమగు నవిధేయత మొదటినుండియు గోచరించుచునే యున్నది. అవసరమని నీకు తోచినప్పుడు మాకు ప్రతికూలముగా ప్రవర్తించుచున్నావు. నీ ప్రభువగు నాయన్నగారు నా నేత్రములను తీయించవలసినదని నీ కాజ్ఞాపించిరి గదా! అట్లు జరిపితివా? అవిధేయుడవై మేకకన్నును తెప్పించి చూపి, యతనిని మోసపుచ్చితివి. ఇది రాజద్రోహము గాదా? ఇట్టి యసమ్మతములు, అక్రమములు యెన్నియో జరిగించితివి. ఇందువలననే యిప్పుడు నా తనయునకు మీరే విషముపెట్టి చంపియుందురని నా నమ్మకము. మిమ్ములను బంధించి చెఱలో నుంచెదను. ముందెన్నటికైన నాకును నా సామ్రాజ్యమునకు మీవలన హాని గలుగకుండునట్లు మీ కన్నులను దీయించెదను—" అని చివాలున లేచి వారలను గొంపోయి చెఱయందుంచుట కాజ్ఞాపించెను.

ఎంత గొప్ప నేరము! తిమ్మరుసెంత విశ్వాస ఘాతకుడు? సార్వభౌముడగు తన యన్న యాజ్ఞను పాటించి తన

కనులను దీయించకపోవుట రాజద్రోహమట! మీరుమిక్కిలి మోసమట! అప్పాజీ యని యనురాగ ముట్టిపడ దీనవద నుడై పాదములబడి రక్షింపుమని వేడుకొన్ననా డీ మాట లేమూల దాగినవో?

తనను పెంచి పెద్దజేసి గాపాడి రక్షించిన జనక తుల్యుడు తిమ్మరుసు, తనకు విద్యాబుద్ధులు గరిపి యింత వానిని జేసినగురువు తిమ్మరుసు, తనకు రాజ్యమిప్పించి తన్ను సార్వభౌముని జేసి సుఖపెట్టిన మహామంత్రి తిమ్మరుసు, తనను దిగంత విశ్రాంతి యశస్కుని గావించిన స్వార్థత్యాగి తిమ్మరుసు, అట్టి తిమ్మరు సిప్పుడు రాజద్రోహియని, మోసగాడవి ఆ కృష్ణదేవరాయ లనుచున్నాడు! ఔరా! కాలమహిమ!

ఇది సత్యమా! ఎంత పుత్రానురాగమున్నను సువి వేకియు, సుబుద్ధియునగు రాయలు కృతఘ్నుడై, క్రూరుడై, అప్పాజీనిట్లు చేయునా? ఎవరు చెప్పగలరు?

ఇంతకును దయామయుడును, నవనీతకోమల హృద యుడును నగు తిమ్మరుసు రాయలపుత్రుని విషప్రయోగమున జంపించునా? అట్టి రాక్షసకృత్యమున కాతడొడిగట్టునా! అతని విరోధు లెవరేని యీ దోషమతనిపై నారోపించి యుండవచ్చును. విధి విధానమట్లున్నది గాబోలు!

పాపము వృద్ధుడగు తిమ్మరుసు కొంతకాలము చెఱ యందుండి స్వర్గస్థుడయ్యెను.

---

కల్యాణి ప్రెస్, తెనాలి—11-45/-50 కాపీలు.

